## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవన్నీగాక - రంగుల బొమ్మ కథ
ఫొటోశీర్షికల పోటీ - మొదలైన మరిఎన్నో ఆకర్షణలు

## అడ్రసు మార్పు :

అందమైన అచ్చుపనులకు ఖ్యాతిగన్న

# ది బి. ఎన్. కె. ప్రెస్, లిమిటెడ్.,

37 ఆచారప్పన్ వీధి, :: మద్రాసు - 1 నుండి

## చందమామ బిల్డింగ్స్

వడపళని, మద్రాసు - 26 కు మార్చబడినది.



మా ఖాతాదారులు, అభిమానులు, వ్యాపార సంస్థలు, ప్రచురణదార్లు, ఈ అడ్రసు మార్పును గమనించ ప్రార్థిస్తున్నాము.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ప్రజ్ఞ కలవాళ్ళందరూ ఈ ప్రపంచంలో రాణిస్తారని అనుకోవటం పొరపాటు. మానవునిలో ప్రజ్ఞ ఉన్నంతమాత్రాన వానికి ప్రజలలో ఆదరణ కలుగుతుందని నమ్మలేము. ఈ పరమ సత్యాన్ని అతి చక్కగా వెల్లడిస్తున్నది ఈ సంచికలోని 'శిల్పి' అనే గేయకథ. తనకు గల అఖండ ప్రజ్ఞను నమ్ముకొన్నాడు శిల్పి. 'ప్రజలు నన్ను మెచ్చక పోతారా!' అని ఎంతకాలమో ఓర్చి, ఓర్చి తపించిపోయాడు. తిండి లేకున్నా శిల్పంలో తనకు గల నేర్పును దీక్షతో ప్రదర్శిస్తూనే వున్నాడు. తిప్పలుపడటమే మిగిలిందికాని, శిల్పిని ఒక్కరూ మెచ్చలేదు, వాని మొగమైనా చూడలేదు! చివరకు, అదృష్టవశాన వచ్చి వాని అవస్థ చూచిన 'కలీఫు' లోకంలో యెలా మెలగాలెనో ఆ కీలకం చెప్పాడు. శిల్పి కన్ను తెరిచాడు. బ్రతుకుతెరువు తెలుసుకొన్నాడు.

సంపుటి 14 : మే 1954 : సంచిక 5



SANKAR.

# శిల్పి

(గేయ కథ)

బాగ్దాదు పురములోన నొక్క రేయిని
మారువేషధారు డయిన న్యాయశీలుడు
కలీఫయిన హరౌనాల్ రషీదు వరుండు
తిరుగుచుండె ప్రజల తెన్ను తెలిసికొనుటకు.

వరుసగాను యూరిలోని వీథులన్నియు
సంచరించి వచ్చుచుండ నొక్క సందులో
పేదజనము కూడియుండు స్థానమునందు
శిల్పి యొకడు శిరము వంచి చెక్కుచుండెను.

సూక్ష్మముగను, సున్నితముగ, సుందరముగను,
వింతవింత భావములను ఆశయములను
నిగ్గుదీర్చి రూపమిచ్చి అబ్బురంబుగా
శిల్పమందు స్థిరముగాను నిల్పె నాతడు.

గూఢమయిన వివిధ భావపూరితములుగ
శిల్పశాస్త్ర మెఱుక లేనివారి కందని
స్వప్నలోక భ్రాంతి నిచ్చు విగ్రహములను
కుప్పలుగను చెక్కియుంచె శిల్పి దీక్షతో.

మనసులోని వింత భావరాసులన్నియు
ప్రతిఫలించె నతనియొక్క చేతిపనులలో
కాని, కొనగరారు ఎవరు అతని బొమ్మలు
తెలియలేదు వెకిలిజనుల కందు విలువలు.

అల్‌రషీదు నిలచి చూచె నతని యంగడి
లోననున్న శిల్పి యలసి కునుకుచుండెను
చేతికఱ్ఱ నేల దట్టి పిలిచె కాలిఫు
"పలుకవేమి త్రాగితివా తిన్నమీదట?"

"తినుట యెట్లు చిల్లిగవ్వ దొరకకుండగ
కొనగరారు ఎవరుకూడ నాదు శ్రమలను
త్రాగుమాట దేముడెఱుగు నిజము జెప్పగ
రోజులాయె కూడు గుడిచి" అనెను యాతడు.

"అయిన గొనుము దీని నిపుడు యవసరమునకు"
అనుచు కాలిఫతనివంక రూక విసరెను.

"మనసులోన నేను నుడువు విషయ ముంచుము
వెండి నీవు తిండికొఱకు వెతలు జెందవు.

నీవు చెక్కు చిత్తరువుల గొప్పతనమును
తెలిసికొనగ శక్తి లేదు ప్రజల కంతయు
విడుము నీవు నీదు ఉన్నతాశయంబులు
కడుపుకొఱకు కట్టిపెట్టు కళను యెడముగ.

చెక్కుమెపుడు యందరికిని తెలిసినట్టివి
గుఱ్ఱములును, గోపురములు, కొండముచ్చులు,
బిచ్చగాడు, గంగిరెద్దు, రేవుచాకలి;
మఱువకుండ యడుగుమెపుడు హెచ్చువిలువను."

వేఱు తెఱువు లేక శిల్పి వార్త మిఱక
కళను వదలి ప్రజల కెంతొ ప్రీతి జేయగ
వరద వచ్చినట్లు జనము కొనిరి ప్రతిమలు
ధనికు డాయె శిల్పి—కాని శిల్ప ముడిగెను.

—వేదం వెంకటరామన్





# విలువ తెలియనివాడు

పూర్వం ఒకప్పుడు మగధరాజు కాలంలో, బోధిసత్వుడు ఒక ఏనుగురూపం తాల్చాడు. ఆ ఏనుగు తెల్లటి శరీరచ్ఛాయతో, ఐరావతాన్ని పోలివున్నది. ఇక దాని అందచందాలూ, లక్షణాలూ వర్ణించతరమేకాదు. అందుచేత, మగధరాజు ఈ ఏనుగును తన ఆస్థానగజముగా చేసికొన్నాడు.

ఒక పర్వదినమందు మగధరాజ్యం అంతా దేవలోకాన్ని మించి అలంకరించబడింది. నగరమంతటా అతి వైభవమైన ఊరేగింపు జరగటానికి ఏర్పాట్లు జరిగినై. ఇందుకోసం ఆస్థాన గజాన్ని ఆకర్షణీయంగా ముస్తాబుచేశారు. సైనికబలాలు ముందు వెనకలు నడుపగా, ఏనుగు ఊరేగింపు చాలా గొప్పగా బయలుదేరింది.

దారి పొడుగునా జనం ఉత్సాహంతో "ఆహా! ఏమి ఆ ఏనుగు హుందా! ఏమి సౌందర్యం! ఏమి దాని గమనం!! ఇది నిజంగా సార్వభౌముల ఆస్థానంలో ఉండవలసిన ఏనుగు కదా..." అంటూ అనేక విధాల దానిని మెచ్చుకోసాగారు.

ఈ మాటలకు రాజు సంతోషించలేదు సరికదా అసూయపడ్డాడు. ఈ ఏనుగుమీద ఆయనకు అకారణమైన ద్వేషం అంకురించింది. ఆ ద్వేషం ఎంతవరకు పోయిందంటే 'దీనిని చంపివేస్తేకాని నాకు నిద్రపట్టదు' అని రాజు నిశ్చయించుకొనేటంతవరకూ పోయింది.

మరునాడు మావటివానిని పిలిపించి 'చూడు, మావటీ!—ఈ ఏనుగు మంచి శిక్షణలో వుందా?' అని అడిగాడు రాజు.

'గొప్ప శిక్షణలో పెరిగింది ప్రభూ!' అన్నాడు మావటి తడుముకోకుండా.

'లేదు సుమా! ఇది ఏమీ చేతకాని ఏనుగు అని నా వుద్దేశం' అన్నాడు మహారాజు. అందుకు మావటి 'మన్నించాలి



మహారాజా!—ఇది చాలా గొప్ప శిక్షణలో, అతి జాగ్రత్తగా పెరిగింది ప్రభూ' అని మళ్ళీ చెప్పాడు.

'మరి, నువు చెప్పినట్టు, ఇది గొప్ప ఏనుగే అయితే, దీనిని ఆ పర్వత శిఖరానికి ఎక్కించగలవా?' అన్నాడు రాజు.

'ఓ. తప్పకుండా' అంటూ, తను ఏనుగు మీద కూర్చొని, మావటి దానిని పర్వత శిఖరానికి ఎక్కించాడు. అతని వెంబడి రాజూ, పరివారమూకూడా పర్వతం ఎక్కారు.

ఆ శిఖరం ఒకచోట కోసుగా కొనతేరి వున్నది. అక్కడ ఆగుమన్నాడు రాజు.

'మరి నీ ఏనుగు ఎంతో గొప్పది అని అన్నావే. దానిని మూడు కాళ్ళపైన నిలబెట్టు చూతాం!' అన్నాడు రాజు.

వెంటనే మావటి ఏనుగును అట్టె అంకుశంతో తాకి, సైగచేసి, 'బాబా! ప్రభువువారి ఆజ్ఞ అయింది. మూడు కాళ్ళమీద నించో!!' అన్నాడు. నించుంది ఏనుగు.

తరువాత రాజు మళ్ళీ 'బాగుంది. ముందటి రెండు కాళ్లమీదా నించోగలదేమో చూడు' అన్నాడు. ప్రజ్ఞ చూపించుమని ఏనుగుకు సంజ్ఞచేశాడు మావటి. అలానే చేసిచూపింది ఆ బ్రహ్మాండమైన ఏనుగు. 'ఇదీ బాగానే వుంది. ఐతే, ఇప్పుడు వెనుక కాళ్ళు రెండింటిమీదా నించోమను' అని ఆజ్ఞాపించాడు రాజు. అలాగూ చేసింది ఏనుగు.

మళ్లీ రాజు 'ఒంటికాలిమీద నించోగలదా నీ ఏనుగు?' అని ప్రశ్నించాడు. ఒక్క కాలిమీదా నించుంది గజరాజు.

ఇన్ని విధాల తిప్పలు పెట్టినా, ఏనుగు పర్వతశిఖరంమీదినించి కిందకు పడనే లేదు. అందుచేత రాజు కోరిక నెరవేరలేదు. ఏమీ పాలుపోయిందికాదు. బాగా ఆలోచించిసమీదట—

'ఏమిటయ్యా మావటీ, ప్రజ్ఞలు పలుకుతున్నావు. ఇంకొక్క పరీక్ష పెట్టతలిచాను.




ఆతడు విలువతెలియనివాడు. నీకు నిజంగా శక్తే ఉన్నట్టయితే, నన్నెక్కించుకొని గాలిలో ఎగిరిపో ' అని చెప్పి సంజ్ఞచేశాడు.

మహిమ గల ఆ బ్రహ్మాండమైన ఏనుగు ఒక్కసారిగా ఆ పర్వతశిఖరంమీదినుంచి గాలిలో విహరిస్తూ విమానంలాగా పోసాగింది. అలా పోతున్నప్పుడు ఏనుగు మీద వున్న మావటి రాజుతో ఇలా అన్నాడు :

' ఓ రాజా !—ఈ ఏనుగు సామాన్యమైం దనుకొంటున్నావు, కాదు సుమా. చాలా మహత్తరమైంది. దైవాంశతో కూడుకొన్నది. విలువ తెలియని నీవంటివాని ఆస్థానంలో ఉండతగ్గది కాదు. విలువ తెలియని మూర్ఖులు, ఇటువంటి ఏనుగులనే కాదు, మరి దేనినైనా పోగొట్టుకొంటారు. నీకు గల ఐశ్వర్యమూ, సంపదా ఇలానే పోతుంది. నీ పేరూ ప్రఖ్యాతీకూడా ఇదేవిధంగా పోతుంది' అని చెబుతూ, మళ్ళీ ఒక్కసారి రాజుతో ఇలా రెట్టించాడు—

" మూర్ఖుణ్ణి గొప్పపదవిలో కూర్చోబెడితే ఇతరుల విలువ తెలుసుకోలేక తనకు తనే బాధ పడతాడు. తన అవివేకాన్ని తనే బయలు పరుచుకొంటాడు. దానితో అందరకూ శత్రువు అవుతాడు. ఈ పరమసత్యాన్ని ఇప్పుడైనా తెలుసుకో !"

నీ ఏనుగుచేత చేయించు, మరి !' అన్నాడు రాజు, గంభీరంగా. రాజు ఏమిచెబితే దాని కల్లా సిద్ధపడ్డాడు మావటి.

' చేతనైతే, నీ ఏనుగును కాళ్ళు ఆధారమే ఎంతమాత్రం లేకుండా, గాలిలో నడిచేటట్టు చెయ్యి ' అన్నాడు, రాజు.

సాటిలేని తన ఏనుగువిషయంలో రాజు తలపెట్టిన దురుద్దేశాన్ని గ్రహించాడు మావటి. కాని, ఎంతమాత్రం అధైర్యం చెందలేదు. ఏనుగుచెవిలో రహస్యంగా ఇలా చెప్పాడతను : ' బాబా !—నువ్వు ఈ శిఖరంనుండి కిందపడి ప్రాణాలు వదలాలని రాజు వుద్దేశంగా కనబడుతున్నది.

అలా గాలిలో ఎగురుతూవున్న మావ టీడు పోయి పోయి, కాశీరాజ్యం చేరుకొని అక్కడ ఉద్యానవనంపైన నిలిచాడు. గాలిలో విహరిస్తూవున్న ఆ ఏనుగును చూడగానే నగరంలో మితిలేని కోలాహలం బయలుదేరింది. జనమంతా విరగబడి ఈ వింత చూడసాగారు.

ఈ వార్త ఒక్క చిటికలో రాజుగారికి చేరింది. తక్షణమే కాశీరాజు ఆ ఏనుగు నిలిచిన చోటికి స్వయంగా వచ్చి—

"గజరాజా!-నా రాజ్యానికి వచ్చి నన్ను ఉద్ధరించు. కిందికి దిగిరా!" అన్నాడు.

ఈ మాట అనడమే తడవుగా ఏనుగు రూపంలో వున్న బోధిసత్వుడు ఆకాశంమీది నించి కిందికి దిగివచ్చాడు. దిగివచ్చి, తన తొండంతో కాశీరాజుకు నమస్కరించాడు. కాశీరాజు తరిచితరిచి ప్రశ్నించేసరికి, జరిగిన సంగతి సందర్భాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు మావటి. అటు కాశీరాజుకూ, ఇటు మావటివానికీకూడా చెప్పలేని సంతోషం కలిగింది.

ఆ ఏనుగును చక్కగా అలంకరించి, ఒక దివ్యసుందరమైన ప్రత్యేకశాలలో దానిని ప్రవేశపెట్టాడు రాజు. అపురూపమైన ఆ ఏనుగును ప్రాణసమానంగా చూచుకో సాగాడు.

అంతే కాదు. తన రాజ్యాన్ని మూడు భాగాలుగా విభజించి, ఒక భాగం ఏనుగు రూపంలోవున్న బోధిసత్వుడి పోషణకోసం, రెండవ భాగం మావటీనికి ఇచ్చివేసి, తక్కినది తను అట్టేపెట్టుకొన్నాడు.

తలవనితలంపుగా ఇటువంటి గజరాజు తన ఆస్థానానికి రావటం గొప్ప అదృష్టంగా భావించాడు కాశీరాజు. బోధిసత్వుడు భూమిపైన అడుగుపెట్టిన క్షణంనించీ కాశీరాజు ఐశ్వర్యమూ సంపదా ఎన్నో ఇంతలు వృద్ధికాజొచ్చింది. కాశీరాజుకు పేరూ ప్రఖ్యాతీ ఎక్కువయినై.






రామయ్య ఒక తోటమాలి. ఒకరోజున అతను యజమాని తోటలో మొక్కలకు గొప్పు త్రవ్వుతున్నాడు. ఉన్నట్టే వుండి, వెనుకనుండి టకటకమని బూట్ల చప్పుడు వినిపించింది. గప్పున వెనక్కి తిరిగి చూచాడు రామయ్య. చూడగా—ఆయన ఎవరో ధనవంతుడిలాగా కనిపించాడు. ఆ కోటూ, బూటూ, టోపీ, కళ్లజోడూ చూస్తే, ఆయన గొప్పవాడని వేషాన్నిబట్టే తెలుస్తున్నది. రామయ్య లేచినించుని, ఆయనకు నమస్కరించాడు.

'అబ్బాయీ !—తోటమాలి రామయ్య నీవేనా ?' అని అడిగాడు ఆయన.

'అవునండి బాబూ !' అన్నాడు రామయ్య.

'నీవు పదేళ్లక్రిందట యెవరిదగ్గర పని చేశావో, జ్ఞాపకముందా ?' అని అడిగాడు.

'అయ్యో బాబూ, జ్ఞాపకం లేకపోవడం ఒకటా ? ప్రభువులు సుబ్బరాజుగారి తోటలో మాలీగా ఉండేవాణ్ణిగదండీ. చల్లని మారాజు, వారి పేరు చెప్పితే అడవిలోకి పోయినా అన్నం పుడుతుంది. ఆయన కంటికి కనబడకుండా, ఎక్కడో విదేశాలకు వెళ్ళిపోయారు, బాబూ. లేకపోతే, ఈ జన్మలో వదులుతానా వారిని !' అంటూ, తన మనసులో గల అభిమానమంతా వెల్లడించసాగాడు.

'అవును. వారక్కడ...' అని ఊరుకొన్నాడు ఆయన.

'కులాసాగా ఉన్నారా బాబూ ?' అని ఆత్రంతో ప్రశ్నించాడు రామయ్య.

'అదే చెప్పబోయేది. పాపం, సుబ్బరాజుగారు అక్కడ కాలంచేశారు...' అన్నాడు కొత్తమనిషి.

కస్తల విశ్వనాథ్





ఈ మాటకు రామయ్యా ఒక్కసారి గతుక్కుమని ఎంతగానో విలపించాడు.

కొంతసేపటికి రామయ్యా తేరుకొని, 'అహా, మా సుబ్బరాజుగారివంటి మనిషి ఈ లోకంలోనే లేరు. ధర్మప్రభువు...' అంటూ, యజమానిని పొగడటానికి ఆరంభించాడు. తరువాత ఆ వచ్చినాయనను 'బాబూ! వారు మీకు బంధువులా?' అని అడిగాడు రామయ్యా.

అందు కాయన 'కాదు. నేను వారి వకీలును. రాజుగారు చచిపోయేముందు ఒక వీలునామా వ్రాశారు. అందులో మన వూరి పాఠశాలకూ, వైద్యశాలకూ, గ్రంథాలయానికీ-ఇంకా ఎన్నో సంస్థలకు ఆయన భూరివిరాళాలు ఇచ్చివున్నారు,' అని వర్తమానం చెప్పాడు.

తోటమాలి రామయ్యా ఈ వార్త విని మనసారా ఆనందించాడు.

అటుతరువాత వకీలు తన కోటు జేబులోనించి ఒక సంచి తీసి, 'అబ్బాయీ, రామయ్యా!—ఇదుగో, దీనిని నీకు అంద జేయమని నాద్వారా రాజుగారు...' అని చెబుతూ, సంచి వానికిచ్చాడు. అది చూచీ చూడటంతోనే రామయ్యా నివ్వెరపోయాడు. అది ఒక సీలు వేసిన సంచి. దానిని తెరవటం ఎలాగో సత్యకాలపు రామయ్యాకు తెలియనేలేదు. అందుకని, 'బాబూ!—ఇదేమిటో కాస్తంత చూచిపెట్టండి' అని వకీలుగారినే కోరాడు. ఆయన సీలు విప్పి, తెరిచిచూడగా అందులో రెండువేల రూపాయలు ఉన్నాయి!

రామయ్యా తన కళ్లను తనే నమ్మలేక పోయాడు. వణుకుతున్న చేతులతో ఆ సంచి అందుకొని, వకీలుగారికి నమస్కరించి, గుడిసెకు చేరుకొన్నాడు. ఒక్కసారిగా ఇంత సొమ్ము కళ్లచూడటం రామయ్యాకు ఇదేమొదటిసారి. నిజానికి ఇది అతను కలలోనైనా తలపరాని విషయం. యజమాని సుబ్బరాజుగారు విదేశానికి వెళ్లక








ముందు, వారికి రామయ్యే తోటమాలి. రామయ్య మంచి నమ్మకస్థుడు. మరి, రాజుగారు వెళ్ళినతరువాత వారి వ్యవహారాలన్నీ ఒక గుమాస్తా చూస్తూవున్నాడు. ఆ గుమాస్తా బలే టక్కరి. రామయ్యకూ అతనికీ పడకపోవటంచేత, రాజుగారి కొలువులోనించి రామయ్య వెంటనే తప్పుకోవలసి వచ్చింది.

ఇప్పుడు రామయ్య ఒక మార్వాడీశేఠ్ తోటలో పనికి కుదురుకొన్నాడు. ఆ యజమానికి 'గులాబ్' అని ఒక పదేళ్ళ కొడుకు. వాడు చురుకైనవాడు. ఐతే, గజదొంగ. ఆ కుర్రవాడు రామయ్యదగ్గర ఎక్కువ చనువుగా ఉండేవాడు. ముప్పొద్దులా రామయ్య పూరిగుడిసెదగ్గరే ఆటలూ, పాటలున్నూ. రామయ్యకు సంచి చేతికి రాగానే పెద్దసమస్య పట్టుకుంది. వాడి గుడిసెకు తలుపులు లేవు. ద్వారబంధాలు లేవు. చూడబోతే, గులాబ్ ఎప్పుడూ ఇక్కడనే మసులుతూవుంటాడు. వాడిని రావద్దనటం ఎలా?

ఈవిధంగా రామయ్య శతవిధాల ఆలోచించి, ఆనాటి సాయంకాలం ఎవళ్ళూ లేకుండా చూసి తోటలో పెద్ద రావిచెట్టెక్కి, దాని తొర్రలో తన సంచి దాచివేశాడు. ఇంటికి వెళ్ళిపోయాడు. ఇక ఫరవాలేదని రామయ్య ధైర్యపడ్డాడు.

తరువాత యజమానివద్దకు వెళ్లి, 'బాబూ !–నేను ముసలివాణ్ణయిపోయాను. మాఊరు పోతాను. అక్కడనే కాలక్షేపం చేసుకొంటాను. సెలవిప్పించండి' అని చెప్పి పోదామని ఊహించాడు రామయ్య.

మరునాడు రావలసిన జీతం అడిగి తీసుకొని, ఉదయానే ఊరికి పోదామని ప్రయాణం పెట్టుకొన్నాడు రామయ్య.

మళ్ళీ ఎవరూ చూడకుండా చెట్టు తొర్రలో పెట్టిన తన సంచి తీసుకొని, వాళ్ళ ఊరు పోయి, సుబ్బరాజుగారు అనుగ్రహించిన ఆ సొమ్ముతో సుఖంగా బతకవచ్చుకదా అని వాడి ఆశ.







రామయ్య ఆశించాడేకాని, కథ అడ్డం తిరిగి, అంతా మరో విధంగా జరిగింది. గులాబ్ యెప్పుడు చూశాడో, యెలా కనిపెట్టాడో కాని, రామయ్య చెట్టుతొర్రలో దాచిన ఆ సంచి చల్లగా కాజేసి, తిన్నగా పట్టుకపోయి తండ్రి కిచ్చాడు.

ఇచ్చి, 'మన తోటమాలి రామయ్య దీనిని ఒకచోట దాస్తున్నాడు. చూచి, నేను పట్టుకువచ్చేశా నాన్నా!' అని చెప్పాడు గులాబ్, సంతోషం పట్టలేక.

శేక్‌కి అపరిమితమైన సంతోషం కలిగింది. ఆ సంచిలోని డబ్బు లెక్కించటం గొడవలో పడి, కొడుకు చెప్పిన మాటలేవీ సరిగా వినిపించుకోనేలేదు. 'సరిగా–రెండు వేలు!—రెండువేలు!!' అంటూ, శేక్ పదే పదే లెక్కింపసాగాడు. 'గులాబ్!—నీవు పోయి ఆడుకో!' అనిచెప్పి, కొడుకును పంపించివేసి, అతడు అదేపనిగా సంచిలో సొమ్ము లెక్కింపసాగాడు.

ఆ రాత్రి రామయ్య యజమానివద్దకు వచ్చి, 'బాబూ!—నేను జరుగురుగా మా ఊరికి పోవాలిసిన పని పడింది. మళ్ళా ఎప్పుడు వచ్చేదీ చెప్పలేకుండావున్నాను. సెలవిప్పించండి' అన్నాడు. ఇందుకు యజమాని 'రామయ్యా!—సరే, బయలుదేరేముందు వచ్చి, నీకు రావలసింది పట్టుకుపో. ఐతే, చూడు: ఈ ముసలి కాలంలో నీకు ఇంత విశ్రాంతి గల నవుకరీ మరొకచోట దొరకటం కష్టంసుమా. ఏమైనా, పదేళ్ళనుంచీ కనిపెట్టుకొని వుంటున్నావు. ఇవాళ మమ్మల్ని విడిచి వెడతావంటే చాలా విచారంగా వుంది' అన్నాడు, ఎంతో అభిమానం ఉట్టిపడుతూ.

పైకి ఇలా విచారం వెల్లడించాడేకాని, 'వీడి రెండు వేలూ మనకు దక్కనైకదా, వీడి పీడ వదిలితేనే మంచిది' అని తలచి, లోలోపల శేక్ సంబరపడుతూనే వున్నాడు. మరునాడు ఉదయానే రామయ్య జీతం



తీసుకొని, పిట్టకు తెలియకుండా పెద్ద రావి చెట్టు దగ్గరకు చేరుకొన్నాడు.

తొర్రలో తన సంచీ చెక్కు చెదరకుండా, పెట్టినది పెట్టినట్టే ఉండటం గమనించి రామయ్య సంతోషించాడు. 'ఆహా—ధర్మం నాలుగు పాదాలా నడుస్తున్నది కదా!' అని మనసులో తృప్తిపడి, రామయ్య తనకు బహుమతిగా లభించిన సంచీ పట్టుకొని ఊరికి వెళ్ళిపోయాడు.

తరువాత గులాబ్ తండ్రివద్దకు వచ్చి 'నాన్నా!—రామయ్య ఎంత నిర్భాగ్యుడు! తనేమో చాలా తెలివిమంతుడనని మురిసి పోయాడు. వాడిని బోల్తా కొట్టించాలే. సంచీ ఎప్పుడు కనబడలేదో, అప్పుడే వాడు ప్రాణాలు వదిలేసివుంటాడు—అమాయకుడు!' అని అన్నాడు.

ఇందుకు శేఠ్ చిరునవ్వు నవ్వి, కొడుకును చేరదీసుకొని, 'ఒరే నాయనా, గులాబ్!—నేను ఆ సంచీ యెక్కడ దాచానో హరిహర బ్రహ్మదులకు కూడా తెలియదన్న మాట. అటువంటిది, పిచ్చి పుల్లాయగాడు రామయ్యకా తెలిసేది!' అని చెప్పి, మళ్ళీ నవ్వాడు తన ప్రజ్ఞకు పొంగిపోతూ.

వెంటనే కుర్రవాడు గులాబ్ 'ఎక్కడ దాచావు నాన్నా? ఎక్కడ నాన్నా?—' అంటూ ఆత్రంతో అడిగాడు.

శేఠ్ కుర్రవాడిని ఇంకా దగ్గరకు తీసుకొని, చెవిలో ఈ రహస్యం చెప్పాడు: 'అబ్బాయీ!—ఎవళ్ళకూ తెలియనివ్వకూ. జాగర్త!—మన తోటలో, తూర్పుదిక్కున పురాతనంనించీ ఉన్న పెద్ద రావిచెట్టు తెలుసుకదూ?—దాని తొర్రలో దాచి పెట్టాను' అన్నాడు.

ఈ మాటలకు గులాబ్ 'అయ్యయ్యో!—రామయ్య దాచిందికూడా అక్కడే నాన్నా!! నేను చూసి తెచ్చింది ఆ చెట్టు తొర్రలో నించే!' అంటూ, కుప్పలా కూలిపోయాడు.






# వికటమైన నవ్వు

చాలా కాలం క్రిందట, భద్రాచలపు అడవులలో దారిపక్కనే ఒక ఆశ్రమం వుండేది. ఆ ఆశ్రమంలో ఒక యోగిపుంగవుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. అయన మంచి దృఢశరీరం కలవాడు. నిగనిగలాడే నల్లటి మూరెడు గెడ్డం కలవాడు. ఆ మహానుభావుడి దర్శనం చేసేసరికి ఎవళ్ళకైనా సరే, చెయ్యెత్తి మ్రొక్కదామనిపించేది.

ఆ యోగీశ్వరుడు ఈ అరణ్యంలోకి ఎప్పుడు వచ్చాడో, ఎలా వచ్చాడో, ఎప్పుడు ఈ ఆశ్రమం స్థాపించాడో, పిట్టకైనా గుట్టు తెలియదు. తెలియకపోవటంచేత లోకులు తలకొక మాటగా చెప్పుకొనేవారు. ఎవరేమనుకొన్నా, అయన లోకం ఉద్ధరించటానికి విచ్చేసిన మహానుబావుడని మాత్రం అందరూ నమ్మారు. నమ్మి తరణోపాయంకోసం అయనను ఆశ్రయింపజూచారు.

ఐతే— ఈ యోగిపుంగవుడు ఎవరితోనూ మాటాడడు. ఆయన మౌనవ్రతుడు. ఆశ్రమంలో ఎత్తయిన మండపంమీద పద్మాసనం వేసికొని కూర్చొని వుంటాడు. అయనకు ఈ ప్రపంచంతో సంబంధమే లేదా అనే అనిపిస్తుంది చూచేవాళ్ళకు. అందుచేత, వచ్చేపోయేవాళ్ళంతా తమకు తోచిన తృణమో పణమో భక్తిపూర్వకంగా ఆ మండపంమీద వుంచి, స్వామికి ఒక్కసారి మ్రొక్కి మరీ పోతూవుంటారు.

ఈ విధంగా, దోపిడిదొంగలతో నిండి వున్న ఆ మహారణ్యంలో ఈ యోగీశ్వరుడి మూలాన జనసంచారం రోజురోజుకీ ఎక్కువ కాజొచ్చింది. ఇందుకు ఫలితంగా అరణ్య ప్రాంతంలో దోపిడీలూ, దొంగతనాలూ తగ్గిపోవలసింది. కాని, అలాటిదేమీ కనిపించలేదు, సరికదా, అంతకంతకు చోరీలు మరీ ఎక్కువగా ఉంటూవచ్చినై.

ఎస్. సుభద్ర






'అమ్మల్లారా, అయ్యల్లారా!—నేను వృత్తిచేత దొంగనే. ఐనా, నాదంతా ఒక పద్ధతి. నాకు కావలసింది మీ ధనం. అంతే. ప్రాణాలు కాదు. మాటాడక, లొడ్డూ లొసుగూ సగా నత్రా తీసి ఇక్కడ పెట్టివేస్తిరా, మీకేమీ భయం ఉండదు. కాదూ కూడదూ అని, మీరు ఎదురుతిరిగినా, గోల చేసినా, అదుగో ఆ పొదలచాటున వున్న నా జట్టు వాళ్లు చూచారా—ఆ పదిమందీ బిలబిల మంటూ వచ్చేసి, చేయవలసిన పని అంతా చేసిపోతారు. ఒక్కసారి వాళ్లకి సంజ్ఞ చేశానో, మరి చూచుకోండి...' అని చెప్పాడు.

ఒకనాటి రాత్రి పదకొండు గంటలకు ఆ మార్గాన ఒక బండి పోతున్నది. ఆ బండిలో ముగ్గురు స్త్రీలూ, ఇద్దరు పురుషులూ, ఒక పిల్లవాడూ ఉన్నారు. ఆ స్త్రీల వంటినిండా ఆభరణాలున్నవి. హఠాత్తుగా ఒక దొంగలనాయకుడు బండిని అటకాయించాడు. వాడి తలగుడ్డ, మెరిసే గుడ్లూ, కోరమీసాలూ, చేత దుడ్డుకర్ర,—ఈ వేషం చూస్తే బండిలోవాళ్ళకు పైప్రాణాలు పైనే ఎగిరిపోయేటంత హడలుపుట్టింది. ఒక్కళ్లకూ నోట మాట పెకలలేదు.

దొంగలపెద్ద దుడ్డుకర్రతో నేలమీద టక్ టక్‌మని కొడుతూ, వాళ్లను సమీపించి—

బండిలో వాళ్ళు ఒకసారి ఆ దొంగల పెద్ద చూపించిన పొదవైపు చూచారు. అందులో భయంకరమైన తలకాయలు కనిపించేసరికల్లా వాళ్లకు గుండె ఆగిపోయినంత పని జరిగింది. చేసేది లేక పురుషులు తలలు వంచుకొన్నారు. స్త్రీలు తమ నగలన్నీ ఒలిచి నాయకుడి ఎదుట పెట్టారు. అప్పుడు నాయకుడు వారిని 'మీ ప్రయాణం సుఖంగా సాగిపోవుగాక!' అని దీవించి పంపి, ఆ ధనం పట్టుకొని అక్కడనుంచి మాయమయ్యాడు.

తరువాత మరికొంతసేపటికి అదే దారిని ఒక వర్తకుడు కాలినడకను వస్తున్నాడు. యథాప్రకారం దొంగలపెద్ద అతడికి అడ్డం






వెళ్ళి, 'డబ్బా...లేకుంటే నీ ప్రాణం !!' అని బెదరించాడు. ఆ వర్తకుడు చాలా మొండివాడు, యుక్తిపరుడున్నూ. దొంగ వాని మాటలకు బదులుగా, 'ఉన్నది నావద్ద కొంచెం డబ్బు. ఐతే, అది నాది కాదు...' అన్నాడు, నదురూ బెదురూ లేకుండా.

దొంగలపెద్ద వినిపించుకోలేదు. అప్పుడు వర్తకుడు తనదగ్గిర ఉన్న డబ్బు నాయకుడి చేతులలో పెడుతూ, 'పొదల మాటున ఉన్న పెద్దమనుషుల్లారా—మీ నాయకుడి చేతికి వెయ్యి వరహాలు ఇచ్చాను. మీరు దగాపడక, మీమీ వంతులు గుంజుకోండి' అంటూ కేకపెట్టాడు. ఇలా గోలచేసే వర్తకుడికి నాయకుడు దుడ్డుకర్రతో రెండు ఇచ్చాడు. దెబ్బతో వర్తకుడు పారిపోయి, ఒక సత్రం చేరుకొన్నాడు.

అక్కడ సత్రంలో ఆ సమయాన రాజభటులూ, దండనాయకుడూ విడిసిఉన్నారు. వర్తకుడు పోయి వారితో తన సంగతి వెళ్ళబోసికొన్నాడు. అప్పుడు రాజభటులు వానితో 'వాడెక్కడో మాకు చూపవయ్యా. నిమిషంలో పట్టేస్తాం' అన్నారు.

అంతా కలిసి, దొంగలుండే ఆ ప్రాంతానికి చేరుకొన్నారు. రాజభటులు ఒకచోట దాగివున్నారు. వర్తకుడు ముందు నడుస్తూ, అతని వెంట దండనాయకుణ్ణి మాత్రం తీసుకువెళ్లాడు. ఇద్దరే రావడం గమనించి, దొంగలపెద్ద వాళ్లను అటకాయించటానికి ముందుకు వచ్చాడు. 'డబ్బా!...లేదా ప్రాణం!—అదుగో, చూచారుకదా పొదల మాటున మా పటాలం-!' అన్నాడు, దుడ్డుకర్రతో నేలమీద టకటకమని కొట్టుతూ.

దండనాయకుడు కత్తిసాము, గరిడీలు నేర్చిన మొనగాడు. వెంటనే ఈల వేసి, దొంగలపెద్దపైన కలియబడ్డాడు. వాడిని కింద పడకొట్టి, ఉడుంపట్టులాగా గట్టిగా పట్టివుంచాడు. 'వీడి పని నే చూస్తా. మీరు పోయి, ఆ పొదలమాటున పొంచివున్న వీడి

ముఠావాళ్ల పని పట్టండి!' అని భటులకు అజ్ఞాపించాడు.

ఉరకలేసుకొంటూ పోయి రాజభటులు పొదలమాటున పొంచిఉన్న దొంగల ముఠా మీదికి దాడి వెళ్ళారు. వాళ్లలో ఒక్కడూ కదలలేదు, మెదలలేదు. ఎదురుకోలేదు. తప్పించుకోబోలేదు. రాజభటులు వాళ్లను కర్రలతో మోదినా ఎక్కడివాళ్లు అక్కడనే ఉండిపోయారు!

ఇదేమిటా అని పరిశీలించిచూస్తే, ఆ మనుష్యులుగా కనబడే వాళ్ళంతా వట్టి గడ్డిబొమ్మలు! తలకాయలకు మాత్రం మనుష్యులకుమల్లేనే పెద్ద పాగాలు చుట్టి వున్నాయి. దొంగలపెద్ద తెలివికి అందరూ ఆశ్చర్యపోయారు.

యోగీశ్వరుడి ఆశ్రమం అక్కడికి దగ్గర లోనే ఉన్నది కనుక, రాత్రిక ఆశ్రమంలో కాలక్షేపం చేద్దామనుకొని అంతా వెళ్ళారు. చూడబోతే అక్కడ స్వామి లేడు.

దండనాయకుడి అజ్ఞప్రకారం భటు లందరూ పోయి ఆశ్రమమంతా గాలింప సాగారు. ఆశ్రమంలో రకరకాల దొంగ సొమ్ములు కొల్లలుగా కనిపించినై. అవన్నీ వాళ్ళు చిక్కించుకొన్నారు. తరువాత ఇంకా బాగా వెతికేసరికి, నిగనిగలాడే మూరెడు నల్లటి గెడ్డం ఒక గోడకు వేలాడుతూ కన బడింది. అందరూ దానిని వింతగా చూస్తున్నారు.

దొంగలపెద్ద వాళ్ళనుద్దేశించి 'ఏమి టయ్యా, వింతగా చూస్తున్నారూ? అది నా పగటివేషం. ఆ వేషంలోనే నేను మౌనం తాల్చివుండగా నన్ను పూజించి కానుకలు అర్పిస్తున్నారు మీరు. ఇది నా రాత్రివేషం. ఇప్పుడీవిధంగా కానుకలు అర్పిస్తున్నారు. నా పేరే నిశీథానందస్వామి! ఏమైతేనేం, నాగుట్టు కనిపెట్టివేశారు మీరు. సరే కానీండి. మరో నాటకం! మరొక వేషం!!-' అంటూ వికటమైన నవ్వు నవ్వాడు.






## 5

[కుండలినీ రాజ్య సైన్యాలు, ధనాగారం నింపేటందుకు పరరాజ్యాలమీదికి దాడి బయలుదేరినై. అశుభసూచకంగా తోకచుక్క కనబడింది. తుపానులో చిక్కి ఓడలుకొన్ని సముద్రంపాలయినై. కొందరు సైనికులు ఒక ద్వీపం చేరారు. అక్కడ క్రూరమృగాలూ, మాంత్రికులైన ఏకాకి, చతుర్నేత్రులు తారసపడ్డారు. తరువాత—]

సమరసేనుడూ సైనికులూ అలా పొదల మాటున దాగి తొంగిచూస్తూనే ఉన్నారు. సరస్సులో ఇప్పుడు ఎవరో ఒక మనిషి నిలబడివున్నట్టు స్పష్టంగా తెలుస్తూవుంది. ఆ మనిషిని పరిశీలించి చూస్తే, అతనొక కుచ్చులటోపీ ధరించివున్నాడు. ఆ టోపీకి ముందుభాగమందు రెండు నేత్రాలవంటి గురుతులున్నయి. ఆ గురుతులలోనుంచి ఒకవిధమైన కాంతి పైకి ప్రసరిస్తున్నది.

ఈ మనిషి ఆ ఏకాకిమాంత్రికుని బద్ధశత్రువైన చతుర్నేత్రుడే అని గ్రహించాడు సమరసేనుడు. ఆ వింతజంతువు—బ్రహ్మాండమైన శరీరమూ, సన్నటి తల కలిగిన ఆ వింతజంతువు వీడిని మింగ జూచినప్పుడు వీడేమన్నాడు?—'ఓసీ!—ఈ చతుర్నేత్రుణ్ణే మింగుదామని వుద్దేశించావా?' అనికదా! ఈ మాటలనుబట్టే, వీడి పేరు 'చతుర్నేత్రు'డని సమరసేనుడికి తెలిసిపోయింది.

'ఐతే, ఇప్పుడు వీడికంట బడకుండా ఎలా తప్పించుకపోవటం?' అని సమరసేనుడు ఆలోచనలో పడ్డాడు. అతను





'ఈ చతుర్నేత్రుడూ ఆ ఏకాక్షిమాంత్రికుడూ బద్ధవైరులే కదా ?'—ఇందుకు సైనికు లందరూ ఒకే కంఠంతో 'అవునవును!' అని బదులుగా అన్నారు.

అంతలోనే, వారిలో ఒకడికి అనుమానం కలిగింది. 'మహాసేనానీ!—మరొకలాగున తలచకుండావుంటే ఒక్క చిన్న మాట అడగాలనివుంది' అన్నాడు.

'నిరభ్యంతరంగా అడగవోయ్! నువ్వే కాదు, ఎవ్వరైనాసరే అడగవచ్చు. ఇటు వంటి ఆపదసమయంలో ఒక్కడి మాట మీద పోవటంకన్న, నలుగురం కలిసి ఆలోచించి నిశ్చయానికి రావటమే శ్రేయస్కరం!' అని ప్రోత్సహించాడు సమరసేనుడు.

అందుకు సైనికుడు 'సేనానీ!— చతుర్నేత్రుడికీ, ఏకాక్షిమాంత్రికుడికీ మధ్యని గల వైరాన్ని మనకు అనుకూలంగా వినియోగించుకొందామని మీ ఉద్దేశ మైనట్టుంది! ఐతే, నాది ఒక్కమాట: సింహానికీ, పెద్దపులికీ శత్రుత్వమే. కాని అవి రెండూ క్రూరమృగాలే అన్న సంగతి మనం మరచిపోకూడదుగదా ?' అన్నాడు.

సమరసేనుడు మళ్ళీ యోచనలో పడ్డాడు. 'నీ మాటా నిజమేనోయ్...' అని

యీ ఆలోచనలో ఉండగానే ఒక సైనికుడు 'సేనానీ!—మనలాగా రెండు కన్నులు కాకుండా, వీడికి నాలుగు నేత్రాలు ఉన్న ట్టున్నయ్యే ?' అన్నాడు. వెంటనే మరొక సైనికుడు అందుకొని, 'ఉన్నట్టుండటం ఏమిటి నీ బుర్ర, స్పష్టంగా కనపడుతూ వుంటే? అదీగాక, వాడి పేరే చతుర్నేత్రుడాయె!. ఇంకా సంశయమా ?' అన్నాడు ఎంతో కోపంగా.

ఇదంతా ఒకపక్క వింటూనూ ఉన్నాడు సమరసేనుడు, మరొకపక్క ఆలోచన సాగిస్తూనూ వున్నాడు. చప్పున అగి, తన సైనికులకేసి తిరిగి ఇలా ప్రశ్నించాడు:





నిట్టూర్చి—'వీళ్ళు మహామంత్రవేత్తలు. దుష్టశక్తులన్నిటినీ అదుపాజ్ఞలలో పెట్టుకొని ఉన్నవాళ్ళు...' అని అనేటంతలోనే, సరస్సులోనించి చతుర్నేత్రుడు ఒడ్డుకు వచ్చాడు.

సమరసేనుడూ సైనికులూ కంపించి పోయారు. పారిపోదామని బుద్ధిపుట్టింది. ఒక అడుగు వేసి, రెండో అడుగు పడే టంతలో చతుర్నేత్రుడి కంచుకంఠం మారుమోగింది :

'ఓరీ పిచ్చివాళ్ళల్లారా!—నన్నే కను గప్పుదామని చూస్తున్నారా? ఊహుఁ-మీవల్ల కాదు. ఈ చెట్లూ చేమలూ, కొండలూ గుట్టలూ, ఏవీ నా దృష్టికి ఆటంకపడలేవు. దేనినైనా ఛేదించుకుపోతుంది నా చూపు. ఈ ద్వీపంలో ఏ మూల ఏం జరుగు తున్నదో, ఏ క్షణంలోనైనా చెప్పగలను— ఉండండి—ఉలూకా! నరవానరా!!' అంటూ కేకవేశాడు.

ఈ కేకకు నల్లగూబా, నరవానరమూ పరుగెత్తుకొంటూ వచ్చి, సమరసేనుడి దారికి అడ్డంగా నిలబడినై. నరవానరం చేతితో ఒక చెట్టుకొమ్మ పట్టుకొని ఝళిపింప సాగింది. నల్లగూబ గాలిలో ఎగురుతూ, కర్ణకఠోరంగా అరవసాగింది.





అని అడిగాడు. అతని ముఖాన ఈర్ష్యగాని, కాఠిన్యంగాని మచ్చుకైనా కనిపించలేదు. అతను శాంతమూర్తిగా కనిపించాడు.

చతుర్నేత్రుడు అలా అప్యాయంగా ప్రశ్నించేసరికి వారికి తిరుగా ధైర్యం కలిగింది. కొంచెం కుదుటపడ్డారు. ఐతే, ఈ ప్రశ్నకు జవాబివ్వటమా మానటమా అని సంకోచం పట్టుకుంది సమరసేనుడికి. ఇవ్వటమే మంచిదనుకొన్నాడు. అదీగాక, అతనినుంచి దాచగలిగిందీ ఏమీలేదని తెలుస్తూనేవుంది.

పరిస్థితి అంతా అవగాహనయింది సమరసేనుడికి. ఇప్పుడు వాళ్ళున్నది కేవలమూ నిస్సహాయస్థితి అని తేలిపోయింది. తమ చేతనున్న కత్తులూ అంబులూ పూచిక పుల్లకైనా కొరగావు. అందుచేత, సైనికుల గుండెబెదురు తగ్గటానికని 'మన దేవి ఉండగా మనకేం భయం. అన్నిటికీ ఆ కుండలినీదేవే శరణ్యం!' అన్నాడు.

సైనికులు నివ్వెరపోతూ నిలబడి వున్నారు. చతుర్నేత్రుడు మెల్లగా ఒక్కొక్క అడుగే వేసికొంటూ, వారిని సమీపించాడు. మార్దవమైన కంఠస్వరంతోనే 'ఎవరయ్యా మీరూ? ఈ ద్వీపానికి ఎందుకని వచ్చారు?'

"మాది కుండలినీ ద్వీపం. సముద్రయానం చేస్తూ, తుపానులో చిక్కి ఇక్కడకు చేరుకొన్నాము" అన్నాడు సమరసేనుడు. నవ్వాడు చతుర్నేత్రుడు. "అబ్బాయ్!—నువు చెప్పినదానిలో నిజం లేకపోలేదు. కాని, సముద్రయానం ఎందుకు చేయవలసివచ్చిందో, ఆ కారణంమట్టుకు దాచేశావు. అవునా, కాదా?' అని అతనికి ఎదురుప్రశ్న వేశాడు.

అప్పుడు సమరసేనుడు దాపరికం లేకుండా, ప్రయాణానికి గల కారణాలన్నీ విప్పి చెప్పాడు. తమ ప్రభువు ధనాగారం వట్టిపోవడంతో, దానిని మళ్ళీ నింపే ప్రయత్నంలో, సైనికులను తీసికొని బయలు






దేరానని వప్పుకొన్నాడు. చెప్పిందంతా సాంతంగా విని, చతుర్నేత్రుడు—

"హహ్హహ్హహ్హ!!—ధనంకోసం బయలుదేరి, దురదృష్టవశాత్తు తుపానులో చిక్కుకొని, ఈ మంత్రాలదీవి చేరావన్నమాట! బాగానే వుంది. ఇక్కడా ఒక మాంత్రికుడున్నాడు. అతనికీ ధనాశ ఎక్కువే. ధనాశగల మీరిద్దరూ ఏకమయితే..!" అంటూ వికటంగా నవ్వాడు.

ఏమి చెప్పేటందుకూ సమరసేనుడికి పాలుపోలేదు. అతను అలా తటపటాయించేటంతలో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించేలా ఒక పెద్ద కంఠస్వరం వినబడింది. అది ఏకాక్షిమాంత్రికునిదే!!—'హేయ్, కాలభుజంగా! కంకాళా!! రండి—వెతకండి...' అంటున్నాడు.

వణికిపోతున్న సైనికులకు సమరసేనుడు ధైర్యం చెబుతూ—'అదుగో, ఆ కనబడే పొదలలో దాక్కోండి. వాడు ఏకాక్షే. ఏకాక్షి...' అని హెచ్చరించాడు. వాళ్ళు ఒక్క పరుగునపోయి దాక్కొన్నారు.

వారు చాటుకావడ మేమిటి, ఏకాక్షి మాంత్రికుడు అక్కడ సాక్షాత్కరించడమేమిటి! కాలసర్పమూ, మానవ కపాలమూ వాడి పక్కనే కదుల్లాడుతున్నాయి. చతుర్నేత్రుడు కంటపడగానే, ఏకాక్షి మాంత్రికుడు ప్రళయ భీకరంగా నవ్వి, 'ఎన్నాళ్లకు కనిపించావ్! ఎంతకాలానికి దొరికావ్!!" అంటూ, చర్రుమని ఒరనుండి కత్తి బయటికి లాగాడు.

ఉన్నచోటునే చతుర్నేత్రుడు నిబ్బరంగా నిలబడ్డాడు. 'ఓహో, ఏకాక్షులవారా? దయచేయండి! దయచేయండి!!' అని వికటంగా బదులుచెప్పాడు. ఆ వెంటనే 'నరవానరా! ఉలూకా!!' అని కేకపెట్టాడు. కేక వింటూనే, నల్లగూబా నరవానరమూ వచ్చి వాలినై. వాటినిచూచి ఏకాక్షిమాంత్రికుడు గతుక్కుమన్నాడు.








అది గ్రహించిన చతుర్నేత్రుడు 'ఉలూకా! కుడికంటి రుచి నీకు తెలియనేతెలుసు. ఆ ఎడమ కంటినీ కూడా ఆరగించవోయి!' అని ఉసుకొలిపాడు. తక్షణమే గూబ ఏకాకి మాంత్రికునికేసి ఎగిరింది. వాడు కంగారు పడుతూ 'కంకాళా! ఓ కంకాళా!!' అని అరవసాగాడు. చిటికలో మనిషికపాలం తన బోసినోటిని కదిలిస్తూ, ముందుకు వచ్చి నల్లగూబతో తలపడింది.

'హహ్హహ్హ!—హహ్హహ్హ!!' అంటూ నవ్వుతున్నాడు యేకాకి మాంత్రికుడు. చతుర్నేత్రుడు ఉగ్రుడయ్యాడు. 'నర వానరా!–' అని అరిచాడు. మరు నిమిషం లోనే నరవానరం ఏకాకిమాంత్రికుని కేసి ఒక్క దూకు దూకింది, మాంత్రికుడు 'కాల భుజంగా!—' అని పెద్దగా కేకపెట్టాడు. వెంటనే ఆ కాలసర్పం మెలికలు తిరుగు కొంటూ ముందుకువచ్చి, నరవానరంతో కలియబడింది.

పొదలచాటున ఉండి ఈ పోరాటాన్ని దీక్షతో తిలకిస్తూనేవున్నారు, సమరసేనుడూ, సైనికులున్నూ.

'సరిసమానమైన ఉజ్జీ!' అన్నాడు ఒక సైనికుడు. 'అందుకే బతికిపోయాం' అన్నాడు సమరసేనుడు. ఏకాకిమాంత్రికుని భృత్యులకూ, చతుర్నేత్రుడి వేగులకూ మధ్యని గొప్ప యుద్ధంసాగింది. నల్లగూబను మానవకపాలం తన బోసినోటితో ఒడిసి పట్టబోయింది. నరవానరాన్ని ఒడిసిపట్టా లని కాలభుజంగం అతి తీవ్రంగా పెనగు లాడుతున్నది.

చతుర్నేత్రుడూ, ఏకాకిమాంత్రికుడూ ఒకళ్ళనొకళ్ళు కోపదృష్టులతో చూచు కొన్నారు. ఈ పోరాటం ఇంతలో తేలేది కాదని ఇద్దరికీ తెలుసు.

ఒక్కసారి చతుర్నేత్రుడు నవ్వి, తల మీది టోపీ పైకి ఎత్తి, పెద్దగా 'ఓం-హ్రీం' అన్నాడు. అలా అనీ అనటంతోనే అతడు



అదృశ్యమైపోయాడు. ఆ వెంటనే నల్ల గూబా నరవానరమూ మాయమైనాయి.

ఏకాక్షిమాంత్రికుడు గంభీరంగా సకిలించి—'అదృశ్యమయ్యావూ? కానీ, ఎంతకాలం తప్పించుకు తిరుగుతావో చూస్తాగా...' అంటూ హుంకరించాడు.

తరవాత కోపంతో చుట్టూ పరికించాడు. ఆ ఏకాక్షికి చెట్లచాటున దాగిన సమరసేనుడూ, సైనికులూ కనిపించలేదు. 'హుఁ' అంటూ పళ్ళుకొరికాడు. చతుర్నేత్రుని వేగులతో పోరాడి అలసిపోయిన కాలభుజంగాన్నీ, కపాలాన్నీ సముదాయించాడు. తళతళ మెరుస్తూవున్న చేతిలోని పెద్ద కత్తి ఝుళిపిస్తూ చెట్లకొమ్మలకేసి చూశాడు. అతడికింకా నల్లగూబ అంటే భయంపోలేదు. అది వెనుక అతడి కంటిని పొడిచింది. దాని అరుపు వింటేనే ఏకాక్షి మాంత్రికుడికి ముచ్చెమట్లుపోస్తాయి.

తరవాత అతడు మానవ కపాలాన్నీ కాలభుజంగాన్నీ వెంటబెట్టుకొని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. అంతటితో యుద్ధరంగం తెరపి ఐంది.

'బతికామురా బాబూ!' అనుకొంటూ, సమరసేనుడూ సైనికులూ ఇవతలికి వచ్చారు.

తూర్పుతీరాన వున్న తమ ఓడలవద్దకు చేరుకొందామని మళ్ళీ బయలుదేరి పది అడుగులు వేసేసరికల్లా భూమి పెళపెళమని బద్దలవుతున్నదా అనిపించేటటువంటి అద్భుత శబ్దం వినబడింది.

వినబడటమేమిటి?—ఎదట అగ్ని పర్వతంనుండి లేచి, ఎగసివస్తున్న అగ్ని జ్వాలలు ఆకాశానికి అంటుతున్నయి! ఇది చూచి సమరసేనుడికీ, పరివారానికీ గుండెలు అవిసిపోయినై.

వారు అలా నిలబడి నిర్ఘాంతపోయి ఆ జ్వాలలకేసి అమిత ఆశ్చర్యంగా చూస్తూ వున్నారు. —(ఇంకా వుంది)







# ఉరిశిక్షలు



పూర్వకాలమందు 'పవనపుర'మనే పట్టణానికి ప్రజ్యోతుడు రాజుగా ఉండేవాడు. అయన తన ఆస్థానంలో గొప్పగొప్ప పండితులనూ కవులనూ గాయకులనూ ఎక్కువగా పోషించేవాడు. హాస్య ప్రసంగమంటే అయన చెవి కోసుకునేవాడన్న మాట. ప్రజ్యోతుడిదగ్గర 'వికవికుడు' అని బలే హాస్యగాడు ఉండేవాడు. వికవికుడంటే రాజుకు పంచప్రాణాలున్నూ.

వికవికుడు సామాన్యుడు కాడు. వింత వింత కథలు కల్పించి, నవ్వించే వార్తలు చెప్పగలడు. అసలు అతడు, నోరు మెదప నక్కరలేకుండానే, తన గూనివీపుతో వంకరటింకరగా అడుగులు వేసేసరికల్లా చూసేవాళ్లు పకపక నవ్వుతారు.

రాజుకు ప్రాణసమానుడుగా ఉండటం వల్ల వికవికుడంటే అందరూ ఎక్కువ గౌరవమర్యాదలు కనబరిచేవారు.

మహారాజు అనుగ్రహం పొందాలంటే ముందు వికవికుడి ఆశ్రయం సంపాదించాలి. ఐతే, వికవికుణ్ణి మంచిచేసుకోవటం ఏమంత కష్టం కాదు. అతడు భోజనప్రియుడు—అనగా 'తిండిపోతు!' అతనికి తిండిపెట్టి తృప్తిపరిస్తే రాజువద్ద ఏపనైనా అవలీలగా సాధించుకోవచ్చు.

ఒకసారి ఒక యువకుడు ఆస్థానంలో ఉద్యోగంకోసం ప్రయత్నిస్తూ, వికవికుణ్ణి విందుకు పిలిచాడు. వికవికుడు ఆనాడు ఉపవాసం ఉండి, రాత్రిపూట విందుకు వెళ్ళాడు. విందులో గొప్పగొప్ప అపురూప జంతువుల మాంసాలన్నీ వడ్డించారు.

రుచికరమైన ఆ పదార్థాలు వేగిరపడుతూ గబగబ తినేసరికి వికవికుడి గొంతులో ఒక చిన్న బొమిక అడ్డంపడింది. గుడ్లు తేలవేశాడు వికవికుడు. ఇది చూచి ఆ యువకుడు హడిలిపోయాడు. అందు

వి. జానకి



లోనూ, కేవలమూ రాజావారికి ప్రాణ సఖుడైన వికవికుడికే ఇలాటి ప్రమాదం జరిగిందంటే, ఇంకేముంది, పీక ఎగిరి పోతుందని భయం పట్టుకొన్నది.

వెంటనే యువకుడు వికవికుణ్ణి తీసికొని దగ్గరనేవున్న ఒకవైద్యుడి ఇంటికి వెళ్లాడు. తలుపులు మూసివున్నయి. ఇదీ బాగానే వున్నదనుకొని, వికవికుణ్ణి ఆ మూసివున్న తలుపులకు అనించి నిలబెట్టి, 'ఖిషగ్రాజా! ఖిషగ్రాజా!! ప్రాణాలమీదికి వచ్చింది...' అంటూ కేకలు పెట్టాడు. కేకలు విన్న వైద్యుడు లోపలినించి ఆత్రంగా వచ్చి తలుపు తీశాడు. తలుపు తీసేటప్పటికే యువకుడు అక్కడినుండి తప్పుకొన్నాడు. వైద్యుడు తలుపు తెరవటంలో, తలుపుకి అనించివున్న వికవికుడు దఢాలున లోపలికి పడిపోయాడు.

వైద్యుడి గుండెలు గుభేలుమన్నాయి. తన అజాగ్రత్తవల్లనే తలుపు పక్కన నించున్న రోగి పడిపొయ్యాడనుకొన్నాడు. చూడగా శ్వాస ఆడటంలేదు. ఎవరా అని దీపంపెట్టి పరీక్షగా చూస్తే, ఇంకేముంది, రాజావారి విదూషకుడు! తనకు చావు తప్పదనుకున్నాడు వైద్యుడు.

ఇది పనికాదని ఆ వైద్యుడు వికవికుణ్ణి స్వయంగా బుజాలపైన వేసికొనిపోయి, పక్కనే వున్న ఒక వర్తకుడి పెరటిగోడ ఎక్కి, వికవికుణ్ణి కూరగాయల పాదుల్లోకి చేర్చి, తను చల్లగా జారుకొన్నాడు.

ఆ రోజులో దొంగల భయం ఎక్కుగా వుందని చెప్పి, ఆ యింటిలోని వర్తకుడు రాత్రిళ్లు కాపలా కాస్తున్నాడు. దుడుకర్ర పక్కన పెట్టుకొని, జామిచెట్టుకు చేర్లబడి కునికిపాట్లు పడుతున్న వర్తకుడు అట్టే కళ్ళు తెరవగానే పాదులపక్కనే మనిషి ఆకారం కనిపించింది. 'ఆరి దొంగా!— నువ్వేరా రోజూ మా కూరగాయలు కోసుకు పోతూవుంటు? దొరికావులే. ఇప్పటికిగదా



నీ పాపం పండింది. చూచుకో!' అంటూ, మెల్లగా చెట్టుచాటునుంచి పోయి దుడ్డు కర్రతో రెండిచ్చాడు. దెబ్బకు, గోడకు చేర్లబడివున్న వికవికుడు చాపకట్టుగా నేలకు ఒరిగాడు. దెబ్బతగిలినా వాడు కిక్కురుమనకుండా ఉండటంతో వర్తకుడికి అనుమానం వేసి, బుజం పట్టుకు కదిలించాడు.

వాడు కదలలేదు. దీపం తెచ్చి ముఖం చూశాడు. ఫలానావాడని తెలిసిపోయింది. తన కర్ర దెబ్బలవల్ల వికవికుడు స్మృతితప్పి వుంటాడని వర్తకుడు హడలిపోయాడు.

కొంచెం నిదానంగా ఆలోచించినమీదట, ఆ వర్తకుడు వికవికుడి శరీరాన్ని బుజం మీద వేసుకుపోయి, ఎదుటింటి ద్వార బంధానికి నిలబెట్టాడు. నిలబెట్టి తను మెల్లగా తప్పుకొన్నాడు.

ఆ ఇంటి యజమాని పొరుగూరినించి తెల్లవారుఝామున యింటికి తిరిగి వస్తూ గుమ్మందగ్గర మనిషిని చూచి, దొంగ అనుకొన్నాడు. మెడ పట్టుకుని వికవికుణ్ణి ఒక్క విసురువిసిరాడు. ఆసమయాన గస్తీ తిరుగుతున్న రాజ భటులు అటువైపు వచ్చారు. ఆ మసకచీకటిలో దూరాన ఎవళ్ళో ఇద్దరు కలియబడి, అందులో ఒకడు పడిపోయినట్టు వాళ్ళకు కనిపించింది.




వాళ్లు గబగబ వచ్చి పడిపోయివున్న అతనిని నిలబెట్టారు. ఎవరా అని చూడగా వికవికుడు! వెంటనే ఆ యింటి యజమానిని బంధించారు వాళ్లు. తెల్లవారింది. హంతకుడని చెప్పి ఆ ఇంటి యజమానిని రాజు ఎదుట పెట్టారు. రాజు విచారించి, హంతకుడికి ఉరిశిక్ష విధించాడు.

నాలుగు దారులూ కలిసే స్థలంలో ఉరికంబం అమర్చబడింది. ఈ దురంతం చేసినవాడెవడై ఉంటాడా అని తెలుసుకునే ఆత్రంతో ఊరిలో అశేష జనం విరగబడ్డారు.

తీరా నేరస్థుణ్ణి ఉరికంబం ఎక్కించేసరికి, యువకుడు ఆదరా బాదరా పరుగెత్తు

కొంటూ వచ్చి, 'మహారాజా!—నేరస్థుణ్ణి నేను. యీ వికవికుడి చావుకు కారణం నేనే...' అంటూ తన విందునుగురించి అంతా చెప్పాడు.

సరే, ఆ ఇంటి యజమానిని వదలి, ఈ యువకుణ్ణి ఉరికంబం యెక్కించమన్నాడు ప్రభువు. అంతలోనే వైద్యుడు గుండెలు అవిసేలాగా పరుగెత్తుకు వచ్చి, సంగతి అంతా చెప్పి, తనే నేరస్థుణ్ణి అన్నాడు. అప్పుడు రాజు యువకుణ్ణి విడిచిపెట్టి వైద్యుణ్ణి ఉరితీయమని ఆజ్ఞాపించాడు. వైద్యుణ్ణి ఉరికంబం ఎక్కించేలోపుగా వర్తకుడు రొప్పుకొంటూ వచ్చి, 'నేనే హంతను ప్రభూ!' అన్నాడు.

ఇదంతా చూస్తే అందరకూ ఆశ్చర్యం కలిగింది. వెంటనే మంత్రి అస్థానవైద్యుణ్ణి పిలిచి, వికవికుణ్ణి పరీక్షించమన్నాడు. చూడగా నాడి అందుతూనేవుంది. వెంటనే వికవికుణ్ణి శస్త్రశాలకు కొనిపోయారు. అక్కడ పరీక్షించి గొంతులో బొమికముక్కను బయటికి లాగివేసేసరికి, వికవికుడు 'అమ్మయ్యా!—' అనుకొంటూ లేచి చక్కా కూచున్నాడు!

యువకుడూ, వైద్యుడూ, వర్తకుడూ, ఇంటి యజమానీ—అందరూ నిర్దోషులుగా వదిలివేయబడ్డారు.

ఈవిధంగా బతికి బయటపడ్డ వికవికుణ్ణి మంత్రి 'ఓయి వికవికా!—హితవైన ఆహారం మితంగా ఆరగిస్తూండవయ్యా! లేకుంటే, నీ పని ఇలానే పకపకలవుతుంది!!' అని హెచ్చరించాడు.

అందుకు విదూషకుడైన వికవికుడు 'అదీ చెప్పాలా ప్రభూ, నాకు!' అన్నాడు అట్టహాసంగా నవ్వుతూ.

నాటినించీ వికవికుడు, ఎవరైనా విందుకు పిలిస్తే ఆలోచించకుండా తయారువడేవాడు కాదు. ఒకవేళ వెళ్లినా పదార్థాలు బాగా పరిశీలించిగాని ఆరగించేవాడు కాదు.






అనగనగా ఒక రాజ్యం. ఆ రాజ్యమంతా కీకారణ్యాలతో నిండివున్నది. అరణ్యాలకు సమీపంలోనే గ్రామాలు అమరిఉన్నవి. అటువంటి ఒక గ్రామంలో ఒక పేద దంపతుల కుటుంబం. వాళ్ళకు లేకలేక చాలా కాలానికి ఒక పిల్లవాడు పుట్టాడు. వాడు సర్పరాజు అనుగ్రహంవల్ల కలగటంచేత 'నాగులు' అని పేరు పెట్టుకొని, అల్లారు ముద్దుగా పెంచుకొంటున్నారు.

ఆ దంపతులకు, పగలల్లా అడవిలో కట్టె కంపా కొట్టి తెచ్చుకోవటం, ప్రొద్దుగుంకే వేళకు ఇంటికి చేరుకోవటం మామూలు. వాళ్ళు ఎన్నడూ తమ బిడ్డను ఒంటిపాటుగా వదిలి పోయేవారు కాదు. అడవికి పోయినా, వెంటబెట్టుకొనే వెళ్లేవాళ్లు.

వాళ్ళు అడవిలో కట్టె కంపా పోగుచేస్తూ వుంటే, పిల్లవాడు చెట్లల్లోనూ తుప్పలలోనూ ఆడుకొనేవాడు. వాడికి ఆ వయసుకే అడవిజంతువులన్నీ తెలుసు. నక్క, లేడీ, అడవిపందీ, తోడేలూ—ఇవన్నీ అల్లంత దూరాన ఉండగానే గుర్తుపట్టేయగలడు.

ఒకనాడు నాగులు చెట్లల్లో ఆడుకొంటూ వున్నాడు. వాళ్ళమ్మా నాన్నా కట్టెలు పోగేస్తున్నారు. ఉన్నట్టే వుండి మిట్టమధ్యాహ్నపువేళ, ఆకాశమంతా కారుమబ్బులతో కమ్ముకు పోయింది. క్షణంసేపటిలో గొప్ప పెనుగాలి వీచ నారంభించింది. ఆ గొప్ప గాలివిసురుకు నాగులు ఆడుకొంటున్న చోటునుంచి దూరంగా కొట్టుకుపోయాడు.

నాగులు తలిదండ్రులు కేకలు వేస్తూ అక్కడా యిక్కడా వెతకసాగారు. కాని వారికి వాడి జాడ తెలియలేదు. యిక కొట్టుకుపోయిన నాగులుకు దెబ్బలేమీ తగలలేదు. కాని, పసివాడు భయపడిపోయాడు. వాడువున్న చోటునుంచే అటుయిటు కలయజూచాడు. ఎదురుగా ఒక పొదలోనించి

కె. ఆనందయ్య




రెండు కన్నులు నిప్పుకణాలలాగ మెరుస్తూ, వాడివైపే చూస్తూ వున్నయి. అవి తోడేలు కన్నులనికూడా గ్రహించాడు. అ దగ్గర నుంచి లేచి అవతలకి పోదామనుకొనే టంతలోనే, పొదలోనించి తోడేలు ఒక్క ఉరుకులో వచ్చి నాగులును సమీపించింది. భయంతో వాడు కన్నులు మూసుకొన్నాడు.

అ వచ్చిన తోడేలు ఊరుకోలేదు. దాని మెత్తటి నాలికతో వాడి వళ్ళంతా నాకటం మొదలెట్టింది. తెప్పరిల్లి, నాగులు కళ్ళు తెరిచేసరికి, ఒక ఆడతోడేలు ఎదట కనిపించింది. అది తనను నాకటం చూసి, వాడు గుండెకొంచెం నిబ్బరం చేసికొన్నాడు!



రోజురోజుకూ, ఆ తోడేలుకు నాగులు పైన ప్రేమ వృద్ధికాజొచ్చింది. దాని మాతృప్రేమ చెప్పటానికి మాటలే చాలవు. పాపం దాని పిల్లలను వేటకాండ్రు ఎత్తుకుపోయారు. అందుచేత, అది నాగులునే తన బిడ్డగా చూచుకొంటున్నది. నాగులుకు అది రకరకాల పండ్లూ, మాంసాలూ తెచ్చి పెట్టి, పెంచుకొంటున్నది. ఆ తోడేలు తెచ్చి యిచ్చింది తినటం, అడవిలో ఉండే పిల్ల తోడేళ్ళతో ఆడుకోవటం-ఇదీ పని నాగులుకు. ఇలా కొన్నేళ్ళు గడిచేసరికి నాగులుకు, తోడేళ్ళకు ఉండే చతురత, కాలిబలం, వేగం—ఇవన్నీ అలవడినై. వాటితోపాటు రాత్రిళ్ళు అడవిలో తిరుగుతూండేవాడు.

ఒక రోజున వాడు తోడేళ్ళతో కలిసి ఒక గ్రామ సమీపానికి తిండికోసమని వెళ్లాడు. కూడా వచ్చిన తోడేళ్ళు ఊరిలోనించి కోళ్లనీ, మేకపిల్లలనీ ఎత్తుకువచ్చినై. నాగులుకు అక్కడి జనం కంటబడటంతోనే ఒక్కసారి తన చిన్నతనం జ్ఞాపకానికి వచ్చి, దృష్టి తలిదండ్రులవైపు మరలింది.

నాగులు ఒక ఇంటికి వెళ్ళాడు. తలుపు తట్టాడు. లోపలినుంచి ఆ యింటి యజమానీ భార్యా ఇవతలికి చక్కావచ్చారు. వాళ్ళను చూస్తూనే, మానవుల మాయలు





తెలియని నాగులు అమాయకంగా—'మా అమ్మా నాన్నా మీరేనా?' అని అడిగాడు.

అందుకు ఆ యజమానీ భార్యా 'అయ్యో నాయనా, నువ్వే మా బిడ్డవు. ఎన్నాళ్ళకు వచ్చావురా మా చిట్టితండ్రీ!' అంటూ, కపటప్రేమ కనబరిచి, వాడిని చేరదీసుకొన్నారు. తలిదండ్రులను కలుసుకున్నాం కదా అని వాడికి సంతోషం కలిగింది.

మరునాడు ఆ దంపతులు నాగులుకు పొలంలో మట్టి తవ్వే పని ఒప్పచెప్పారు. ఎండ బాగా నెత్తిమీదికి వచ్చేవరకు పనిచేసి అలసివున్న నాగులు అక్కడ ఒక చెట్టుకింద కాస్త విశ్రమిద్దామని వచ్చాడు. అంతలో పక్కనవున్న గుడిసెలోనించి మాటలు వినబడినై. తన తోడేలు చెవుల్ని ఆ వైపు తిప్పి సంభాషణ వినసాగాడు నాగులు—

"నువ్వు భలే తెలివైనవాడివయ్యా! ఉక్కుముక్కలాంటి కుర్రాడు! ఇక మనం పని చెయ్యనవసరంలేదు. అంతా వాడే చేసుకుపోతాడు" అన్నది భార్య. యజమాని నవ్వుతూ—"మరేమిటనుకున్నావ్! 'మా బిడ్డవేరా బాబూ,' అంటే సరిపాయె. మనం తినగా మిగిలిన మాడుచెక్కలు వేస్తే పడివుంటాడు!" అన్నాడు.




ఈ మాటలు విని, నాగులు తను మోసగింపబడినట్టు గ్రహించి మరో గ్రామం వెళ్లుదామని బయలుదేరాడు.

సాయంకాలానికల్లా వాడు యింకొక గ్రామం చేరాడు. అక్కడ ఒక ఇంటిదగ్గిరకు పోయి—వాకిట్లో కూర్చొనివున్న భార్యాభర్తల్ని చూచి,—"ఏమండీ, మా అమ్మా నాన్నా మీరేనా!" అని అడిగాడు వాళ్ళను అమాయకంగా.

భార్యాభర్తలిద్దరూ నివ్వెరపడి, అంతలోనే సర్దుకున్నారు. భర్త భార్యకు సౌంజ్ఞ చేసి "అవునురా బాబూ! నువ్వు మా బిడ్డడివే. ఎన్నాళ్ళకు తిరిగివచ్చావ్?" అంటూ నాగులిని కౌగలించుకున్నాడు.





నిజమే అనుకున్నాడు నాగులు. ఆ రాత్రి ఇంటిఅతను నాగులుకు ఆ మాటా యీ మాటా చెప్పి—"నాయనా, రేపటినించి పొలంపనీ అవీ నువ్వే చూసుకుపో. మనం చాలా బీదవాళ్లం. పనిపాటులు నువ్వే సర్దుకుపోతూవుండు' అని చెప్పి ఇన్ని గంజినీళ్ళు పోశాడు.

కాని ఆ రాత్రి నాగులు పడుకొన్న తర వాత ఆ భార్యాభర్తలు నవ్వుకొంటూ కమ్మని కూరలతో భోజనం చేస్తూండటం నాగులు పసికట్టాడు.

అతడి చెవులూ, ముక్కూకూడా తోడేలు లాగా అక్కడ వినబడే ధ్వనినీ, ముక్కుకు తగిలే వాసననూ ఇట్టే పట్టివేయగలిగినై.

'వీళ్ళు నిజమైన నా తలిదండ్రులు కారు' అని నిశ్చయించుకొని, నాగులు ఇంకొక గ్రామం బయలుదేరాడు.

ఐతే, ఇంటివాడు ఒకపట్టాన వదిలే రకం కాదు. వాడు నాగుల్ని పట్టుకుని ఒక గదిలో పడవేసి తాళం పెట్టాడు. "ఇక్కడ కూలీ వాళ్ళు దొరకటం చాలా కష్టంగా వుంది. నువ్వు పనిచేయటానికి అంగీకరించేవరకూ పచ్చి మంచినీళ్ళయినా ఇచ్చేదిలేదు!" అంటూ పళ్ళు కొరికాడు.

పగలల్లా నాగులు గదిలోనే వుండి పోయాడు. రాత్రి కాగానే అచ్చగా తోడేలు లాగా అరవసాగాడు. ఆ అరుపు విని చుట్టు పక్కల అడవులలోని తోడేళ్ళు మందలు మందలుగా వచ్చి ఇంటిని చుట్టుముట్టినై. ఇంటివాడు హడిలిపోయి నాగుల్ని గది లోనించి బయటకు వదిలి క్షమించమని బతిమాలుకొన్నాడు.

ఎలాఅయినా తల్లిదండ్రుల్ని కలుసు కోవాలన్న పట్టుదలతో నాగులు అక్కడి నుంచి తిరుగా బయలుదేరాడు. తిరిగి తిరిగి కొన్నాళ్ళకు మరొక గ్రామం చేరాడు. అక్కడ ఒకానొక యింటిముందున్న దంప తులను చూశాడు. వాళ్లు పెద్ద వేపచెట్టు కింద దిగాలుపడి కూర్చొనివున్నారు.

నాగులు సరాసరి వాళ్ళవద్దకు పోయి—

"మా అమ్మా నాన్నా మీరేనా?" అని అడిగాడు అమాయకంగా.

ఆ దంపతులు నాగులుకేసి చూసి, ఏదో గుర్తువచ్చిన వాళ్ళలాగా—

"నాయనా!—తుఫాను గాలిలో మా అబ్బాయి కొట్టుకుపోయాడు. నువ్వు నిజంగా మా బాబులాగే వున్నావు. మేమే నీ తలిదండ్రులం!" అంటూ నాగుల్ని కావిలించుకొన్నారు. కాని, నాగులు నమ్మక తన తోడేలుజిత్తులు ప్రయోగించాలనుకున్నాడు.

ఆ రాత్రి తల్లి భోజనం పెడితే 'నాకు వంట్లో బాగా లేదు' అని చెప్పి తినకుండా వూరుకున్నాడు. తెల్లవారి తల్లి వచ్చి నిద్ర లేపగానే—'నాకు చాలా నీరసంగా వుంది. ఇవ్వాళ పనిచేయలేను' అన్నాడు.

ఈ మాటలు విని తల్లి చాలా ఆశ్చర్యపోయింది. భర్తను పిలిచింది. యిద్దరూ నాగులుదగరకు వచ్చి—

"నాయనా, నువ్వు యింకా పసివాడివి! చదువుకుంటూ ఆడుకోవలసిన వయస్సు. మేమే నీకోసం పనిచేస్తాం, నువ్వు పనిచేసేదేమిటి తండ్రీ!" అంటూ నిండు ప్రేమతో బుజ్జగించారు.

ఈ మాటలు వినగానే నాగులుకు తన నిజమైన తలిదండ్రులను కలుసుకొన్నానని రూఢి అయిపోయింది. ఆ నాటినుంచీ భక్తిశ్రద్ధలతో వాళ్ల ఆజ్ఞలు పాలిస్తూ చక్కగా చదువుకోసాగాడు.

కాని, నాగులు తనను ప్రేమతో పెంచి పెద్దచేసిన తోడేలుతల్లిని మాత్రం పూర్తిగా మరిచిపోలేకపోయాడు. చీకటిరాత్రులలో ఊరివెలపల అడవిప్రాంతాలలో తిరుగుతూ అరిచే తోడేళ్ల గొంతు విన్నప్పుడల్లా అతడికి నిద్ర పట్టేదికాదు.

'ఆ అరిచే తోడేళ్ళలో మా అమ్మకూడా ఉండేవుంటుంది!' అని అనుకొంటూ, కన్నీళ్ళు పెట్టుకునేవాడు నాగులు.



# శంకరయ్యా

(వినోద రచన)

'చిలిపి' శంకరయ్యా నన్ను
పిలిచిపోయి పీట వేసి
పప్పు ధప్పళాలు మరియు
వడియాలు వంగవరుగు
పలురకముల పచ్చడులు
పులిహోర పచ్చిపులుసు
ఆవునెయ్యి ఆవకాయ
అన్నము మరి పాయసంబు
విరివిఐన విస్తట్లో
తినిపించి తీరికగా
వినిపించె రేడియో!

ఇదీ సుఖం ఇన్నాళ్లకు
వదిలిందీ గుదిబండ
రాజు వాడి ఇంటివద్ద
రోజాగా చెలామణీ,
ఉన్నవాడి సహవాసం
ఎన్నటికీ చెరుపు లేదు!

పొగ తాగుడుబోతు దనం,
ఎగవేసే బడికి 'జ్వరం'
మంచివాణ్ణి ఇలా నేను
మారిపోయినా నంటూ
తెల్లబోయి తేరిపార
ఎల్లరు చూచారు నన్ను!

కొన్నాళ్లకు గొడవ తీరి
శంకరయ్యా ఆస్తి పోయి
కంకర రస్తాల వెంట
బాబుల జేబూలు కొట్టె
బాటసారి అయ్యాడు!

చీదరించి చివాట్లేయు
తాత మాట తలపు కొచ్చి
మరొక ఊరు మరలిపోయి
మంచివాడ నయితి నేను!

వత్సరాలు గడిచె నిట్లు
ఉత్సాహం ఉడిగి వాడు
చదువు సంధ్యలు లేక
చపట బ్రతుకు బ్రతకలేక
కూలి నాలి దొరకమిచే
జోలి బట్టి తిరుగుచుండె!

చిన్నప్పుడు కష్టపడితె
అమ్మ నాన్న కబ్బురం
పెద్దప్పుడు కష్టపడితె
ఆలి బిడ్డల కబ్బురం
ఎల్లప్పుడు కష్టపడితె
ఎవరికైన అబ్బురం!

—సుంకర రామమోహనరావు




# బెస్తవాని భార్య

అనగనగనగా ఒక ఊరిలో ఒక బెస్తవాడు. వాడు చాలా మంచివాడు. ఐతే, వాడి పెళ్లాం మట్టుకు మూర్ఖురాలూ, ఆశపోతున్నూ.

ఆ బెస్త దంపతులు ఒక పూరిగుడిసెలో కాపరం ఉండేవాళ్ళు. ఆ పూరిపాక బొత్తిగా శిథిలమైపోయి, పనికిరాని స్థితిలో వుంది. ఆ పూరిగుడిసె నేయించుకోవాలని వాళ్లకు ఆశగా వుండేది. కాని, చేతిలో డబ్బేదీ!

ఒకరోజున బెస్తవాడు, మామూలు ప్రకారం చద్ది తిని, వల పట్టుకు సముద్రానికి ప్రయాణమయ్యాడు. వల వేశాడేకాని మిట్ట మధ్యాహ్నమయినా ఒక్క చేపకూడా పడ లేదు. సాయంకాలమయింది. ఇక కొంపకు మరలిపోదామా అనుకొని వాడు నిశ్చయించుకొన్నంతలో, ఉన్నట్టే వుండి వల కదిలినట్టయింది. ఐతే, లాగటానికి వీలు లేనంత బరువుగా వున్నది. ఎలాగో చచ్చి చెడి, వాడు వలను ఇవతలికి లాగాడు.

చూడగా, ఒక బ్రహ్మాండమైన సొరచేప కనిపించింది! బెస్తవాడి సంతోషానికి అంతు లేకపోయింది. ఆ సొరచేప మానవ భాషలో 'ఓయీ జాలరీ!—నేను నిజమైన చేపనుకాను. రాజకుమారుడను. ఒకానొక పిశాచి మంత్రించి నన్ను ఇలా మార్చి వేసింది. నన్ను పట్టితే నీకేమి ఉపయోగం? కనుక, వదిలెయ్యి' అని వేడుకొన్నది.

చేప ఇలా మాటాడటం బెస్తవాడికి ఆశ్చర్యం కలిగించింది. మళ్లీ దానిని నీళ్ల లోకి వదిలేసి బెస్తవాడు ఆ రోజున ఉత్త చేతులు ఊపుకొంటూ ఇంటికి చేరుకొన్నాడు.

ఇంటికి వెళ్లగానే 'ఇవాళ ఏమీ పడలేదా?' అని అడిగింది భార్య.

ఎం. మాధవరావు



వాడు జరిగిన సంగతి అంతా చెప్పాడు.

'మరి, అతగాడు రాజకుమారుడంటున్నావే? అతనిని ఏమీ కోరలేదా?' అని ప్రశ్నించింది వాడి భార్య.

'లేదు' అన్నాడు బెస్తవాడు.

'చ. బుద్ధిహీనుడా! రాజకుమారుడని తెలిసినప్పుడు ఏమీ కోరుకోకుండా ఉత్తనే వదిలివేస్తారా ఎవళ్లయినా? పో. మళ్లీ వెళ్లి, మన పూరిగుడిసెను కొత్త ఇంటిగా మార్చమని కోరుకొనిరా' అన్నది.

ఈ మాటకు వాడు 'ఆ చేప పోనే పోయింది. ఇప్పుడు తిరుగా అది నాకెక్కడ దొరుకుతుంది?' అని నసిగాడు.

'అఁ-ఏమిటీ! ఇదివరకు యెక్కడ కూర్చున్నావో, సరీగా అక్కడికే పోయి, ఆ చేపను పిలు. అంతగా నీకు అడగటానికి సంశయమయితే, నేను అడిగానని నా పేరు చెప్పు...' అంటూ, బలవంతపెట్టిం దామె. పోరు పడలేక వాడు సముద్రతీరానికి మళ్లీ బయలుదేరాడు.

ఒడ్డున నిలబడి, 'ఓ సొరచేపా!' అని అరిచాడు. వెంటనే ఆ చేప నీటిలోపలి నుండి తల పైకెత్తి, 'ఏమి నాయనా, ఇలా వచ్చావు?' అని ఆప్యాయంగా అడిగింది.

బెస్తవాడు భయపడుతూనే, 'చేపా! చేపా!!—నా భార్య నన్ను పంపితే మళ్ళీ వచ్చాను. మా పాత ఇంటిని కొత్త ఇల్లుగా మార్చిపెట్టమని నిన్ను కోరడంకోసం ఆమె నన్ను పంపించింది' అన్నాడు.

'ఓస్. ఈపాటిదానికే మళ్ళీ వచ్చావా పాపం. సరేలే. అలానే చేస్తాలే' అనిచెప్పి, బుడుంగున మునిగిపోయింది ఆ సొరచేప.

బెస్తవాడు ఇంటిముఖం పట్టాడు. వాడు బెస్తగూడెం వచ్చి చేరుకొన్నాడు. తన పూరిపాక ఉండే చోటున ఒక కొత్త మందిరం కంటబడింది! ఆ కొత్త మందిరంలో పైన నిలబడి వాడి భార్య కేకవేసింది: 'రండి, రండి! ఇటువైపు మెట్లెక్కి మేడపైకి

రండి!!' అని ఆమె సంతోషంగా పిలిచే సరికి వాడు ఆశ్చర్యపడుతూ పైకివెళ్లాడు.

ఆమె భర్తకు ఆ కొత్త ఇల్లంతా చూపించి, 'చూచారా మరి, మన ఇల్లు ఎలా మారి పోయిందో?' అంటూ, తన ప్రజ్ఞను వెల్లడించింది. ఇదంతా తన భార్య తెలివితేటలవల్ల కదా జరిగిందని వాడు మురిసిపోయాడు.

పదిహేను రోజులపాటు ఆ దంపతులకు చెప్పలేని ఆనందంతో గడిచి పోయింది. తరువాత మళ్ళీ ఒకనాడు వాడి భార్య ఇలా అన్నది: 'ఏమండీ, ఇప్పుడీ ఇల్లు బాగానే వుంది. కాని, చుట్టం పక్కం వస్తే సరిపోయేటట్టుగా లేదు. పైగా, మనకి పిల్లా జెల్లా బయలుదేరారంటే అసలే చాలదు. ముందు ముందు మనం చాలా బాధపడవలసి వస్తుంది. అదీగాక, ఇంటికి తగిన పెరడు లేదు. మళ్లీ చేపవద్దకు వెళ్లి, ఇంతకంటె పెద్ద మిద్దెయిల్లు కావాలనీ, తగినంత పెరడుకూడా కావాలనీ కోరుకొని రండి!' అన్నది.

భార్య పోరు పడలేక, బెస్తవాడు మళ్లా సముద్రతీరానికి పోయి, చేపను పిలిచాడు. సొరచేప పైకి వచ్చింది. 'ఏమిటి సంగతి?' అని అడిగింది. వాడు దానితో 'చేపా, చేపా!—ఇప్పుడున్న ఇల్లు యిరుకుగా








వుండట. ఇంతకంటే పెద్ద ఇల్లూ, దానికి తగిన పెరడూకోరుకోమని పంపించింది నా భార్య' అని చెప్పాడు.

'అలాగే అవుతుందిలే' అని చెప్పి, సొరచేప నీటిలో మునిగిపోయింది.

బెస్తవాడు ఇంటికి పోయి చూస్తే, తన చిన్న మందిరం పోయి, దానికి బదులుగా ఒక పెద్ద మేడ, చుట్టూ చక్కని తోటా తయారైవున్నాయి.

ఈవిధంగా మరి కొన్నాళ్ళు సుఖంగానే గడిచింది. తరువాత మళ్ళీ ఒకనాడు, బెస్త వాడి భార్య 'ఏమండీ, ఇంత అందమైన ఇంట్లో నేను మామూలు సంసారిలాగా ఉండటం ఏమీ బాగాలేదు. నేనొక రాణి నైతే, ఈ భవనం ఎంత కలకలలాడుతూ ఉంటుందోకదా! మీరు పోయి, చేపతో చెప్పండి!' అన్నది.

బెస్తవాడు అందుకు 'ఓసీ—తృప్తి లేకుండా మళ్ళీ పోయి, లేని పోని కోరికలన్నీ కోరితే ఆ చేపకు కోపం రాదా?' అంటూ, ఎన్నోవిధాల భార్యకు నచ్చచెప్పాడు. 'ఈ ఒక్కసారిమాత్రం పోయి అడగండి' అని ఆమె గట్టిగా పట్టుపట్టింది.

'ఏమైనాకానీ, నే వెళ్ళేదిలేదు' అని కచ్చితంగా చెప్పాడు బెస్తవాడు.

'సరే. మీరు వెళ్లకపోతే నేనే పోయి చేపను స్వయంగా కోరుకొంటాను' అంటూ బయలుదేరి పోబోయింది. 'గత్యంతరం లేదురా దేవుడా!' అనుకొని, వాడు మళ్ళీ పోయి సముద్రతీరం చేరుకొన్నాడు.

చేరుకొని, పిలిచీ పిలవగానే చేప వచ్చి, 'ఎందుకు నాయనా యిలా వచ్చావు?' అని అప్యాయంగా అడిగింది.

అందుకు భయంతో వణికిపోతూ వాడు 'చేపా, చేపా! తనొక రాణి అవాలని నా భార్య కోరుకురమ్మంది...' అన్నాడు.

'ఒశ్. ఈపాటిదానికేనా ఇంత శ్రమపడి వచ్చావు? సరేలే, వెళ్లు. నీ భార్య రాణి

అవుతుందిలే' అని చెప్పి, సొరచేప నీటిలో మునిగి మాయమైంది.

బెస్తవాడు వెళ్ళేసరికి, తన మామూలు మేడ ఉండేచోట ఒక దివ్యమైన రాజ భవనం అకస్మాత్తుగా వెలిసింది.

ఆ భవనం నిండుగా పరిచారకులు మసులుతూవున్నారు. భవనానికిగల సింహ ద్వారం బ్రహ్మాండంగా ఉన్నది. సిపాయిలు విచ్చుకత్తులతో పహరా ఇస్తున్నారు!

బెస్తవాడు ద్వారంపద్ద నిలబడి తెల్లబోయి చూస్తూవుండగా, పరిచారకులు 'జయం జయం మహారాజా!' అంటూ వచ్చి, వాడిని గౌరవంగా లోపలికి తీసుకపోయారు.

లోపలికి పోయిచూస్తే—అక్కడ ఒక మహాసభ సమావేశమైవుంది. ఆ మహా సభలో గొప్ప గొప్పవారందరూ కూర్చొని వున్నారు. సభ మధ్యని స్వర్ణసింహాసనం పైన బెస్తవాడి భార్య ఆసీనురాలైవుంది.

చెలికత్తెలు నిలబడి పెద్ద పెద్ద విసన కర్రలతో ఆమెకు విసురుతూవున్నారు.

ఇవన్నీ చూచినతరువాత బెస్తవాడు తన భార్యతో 'సరే. ఇప్పటికి నీవు కోరు కొన్న కోరికలన్నీ పూర్తిగా నెరవేరినైకద. సమస్తమైన వైభవాలూ అనుభవించావుకద. ఇంకేమీ కోరికలు మిగలలేదుకద!' అన్నాడు విసుగుతో.



అందుకామె 'ఏమి తీరిపోయినై నా కోరికలు! ఈ ఒక్క భూలోకంలో ఒక చిన్న రాణినైతే సరిపోతుందా? ఆకాశం మీదనుండే సూర్య చంద్రులకు రాణిని ఐనప్పుడుకదా నా సరదా తీరేది?' అంటూ భర్తను వేగిరపెట్టింది.

ఈ మాటలకు బెస్తవాడు చాలా విచారించాడు. 'వద్దుసుమా. నీకు యిలాటి గొంతెమ్మ కోరికలు తగవు సుమా!' అని అనేకవిధాల బోధచేశాడు. కాని, వాడి గయ్యాళి పెళ్ళాం మంకుపట్టు పట్టి కూర్చుంది. చేసేది లేక బెస్తవాడు 'సరే, నీ కర్మ ఎలా అయితే అలా అవుతుంది' అనుకొంటూ మళ్ళీ బయలుదేరాడు.

సముద్రతీరం చేరుకొని మళ్లీ చేపను పిలిచాడు. చేప ఇవతలికివచ్చి 'ఏం నాయనా, ఇలా వచ్చావు?' అని అడిగింది. 'చేపా, చేపా!—నా భార్యకు భూలోకంలో రాణి కావటంతో తృప్తిలేదట. ఆకాశాన వుండే సూర్య చంద్రులకు రాణిని కావాలి అని కోరుతున్నది' అన్నాడు.

అందుకు సొరచేప 'ఒహ్. ఈపాటి దానికే పని కట్టుకొని వచ్చావా? సరేలే. నీ భార్య కోరిక నెరవేరుతుంది. ఐతే, ఈ జన్మలో మాత్రం కాదు. కనుక ముందు ఇప్పుడు—తన కోరికలను మానుకొని, పరోపకారం చేయమని నీ భార్యతో చెప్పు...' అంటూ చేప బుడుంగున నీటిలో మునిగిపోయింది.

బెస్తవాడు ఇంటికి చేరుకొనేసరికి...దివ్య భవనం లేదు, పరిచారకులూ లేరు, సింహాసనంలో రాణీ లేదు. ఆచోటున శిథిలావస్థలో వుండే తన పూర్వకాలపు పూరిపాక—మళ్ళీ ప్రత్యక్షమయింది! లోపలికిపోయి చూడగా, కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ వున్న వాడి భార్య కంటబడింది!






# గుణమణి

రెండువందల సంవత్సరాలకు పూర్వం మైసూరు ప్రాంతంలో 'నిజగల్లు' అని ఒక చిన్న రాజ్యం ఉండేది. ఆ రాజ్యానికి ప్రభువు రామరస నాయకుడు. ఆయన గొప్ప వీరుడు, మంచి మనస్సు కలవాడున్నూ. పట్టపురాణి పేరు 'లకుమవ్వ.'

రాజు సమస్తమైన వైభవాలతోను తులతూగుతూ ఉండేవాడు. కాని, ఒక్కటే లోపం. పెళ్లి అయి పదేళ్ళయినా, సంతతి కలగలేదు. రాజు చేయని పూజలు లేవు. రాణి నోచని నోములు లేవు. ఎంత చేసినా, ఫలితం లేకపోయింది.

లకుమవ్వ మనస్సు చాలా కించపడింది. ఏమీ ?—రాజ్యమన్న తరువాత యువరాజు ఉండాలికదా! ఉన్నప్పుడే పరిపాలన సవ్యంగా సాగిపోతుంది. లేకుంటే అంతా అరాచకమే. కనుక, ఆమె తీవ్రమైన ఆలోచనలో పడింది. ఆలోచించగా ఆలోచించగా ఆమెకు ఒక చక్కటి ఉపాయం తట్టింది. వెంటనే ఆమె, తనకు దగ్గర బంధువైన ఒక సుందరికి కబురుపంపి రప్పించి, తనకు సహచారిణిగా పెట్టుకొన్నది. ఆమె చక్కని చుక్క, సుగుణాల రాణి. పేరు 'గిరిజవ్వ'.

ఈ గిరిజవ్వను గురించి పట్టపురాణి లకుమవ్వ భర్తకు ఎంతగానో చెప్పి, ఆమెను పరిణయమాడవలసిందని కోరింది. మొదట, రాజు ఈ సలహాకు ఇష్టపడలేదు కాని, లకుమవ్వ పదే పదే వేడుకోగా, ఎలా అయితేనేం, గిరిజవ్వను రాణిగా చేసుకోవటానికి సమ్మతించాడు.

గిరిజవ్వను రాజు పెళ్ళిచేసుకోవటంతో లకుమవ్వ సంకల్పం చాలవరకు నెరవేరింది. అయితే గిరిజవ్వకు పెళ్ళికావటంతోనే ఆమె తల్లి, లేనిపోని పెత్తనం కల్పించుకోసాగింది. 'లకుమవ్వ మాట చెల్ల

జి. భాస్కరమ్మ




నీయకు. నీపైనే రాజుకు ఎక్కువ ఇష్టం. కనుక, ఆమెపైన అధికారం చెలాయించి, నీ పంతం నెగ్గించుకొంటూవుండు' అంటూ దుర్బోధలు చేస్తూవచ్చింది.

తల్లి ఎంతగా నూరిపోసినా, ఉత్తమురాలైన గిరిజవ్వలో ఏమీ మార్పు రాలేదు. ఆమె, తనను చేరదీసి, రాణిగా చేసినందుకు పట్టపురాణిపట్ల కృతజ్ఞత చూపిందే కాని, అక్కను తృణీకరించటానికి ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. ఇది ఆమె తల్లికి కష్టమే అనిపించింది.

ఏమైతేనేం, అదృష్టం పండి, రెండేళ్ళకల్లా గిరిజవ్వకు ఒక మగశిశువు కలిగాడు. రాజూ, రాజ్యంలోని ప్రజా, అందరికంటె ముఖ్యంగా లకుమవ్వా, చెప్పలేని సంతోషం పొందారు, ఉత్సవాలుచేశారు.

ఇదిలా వుండగా—

గిరిజవ్వకు కస్తూరినాయకుడు అని ఒక తమ్ముడు ఉన్నాడు. వాడొక దుష్టుడు. పైగా, పరమమూర్ఖుడు. వాడికి చెడ్డవాళ్లతో స్నేహం. గిరిజకు ఎప్పుడైతే పెళ్ళి ఐందో, నాటినుంచీ వాడూ కోటలోనే ఉంటూ వచ్చాడు. ఇందుకు తోడు, రాణిగారి తమ్ముడైనందుకు ఆస్థానంలో మంచి పదవి, అధికారంకూడా లభించినై.

అయితే—ఒకనాడు అకస్మాత్తుగా శత్రుసైనికులు కోటలోకి వచ్చేశారు. దీనికి కారకుడెవడు? కస్తూరినాయకుడే! వాడు శత్రువులతో కూడి, వాళ్ల సాయంతో బావమరిదిని తొలగించి, నిజగల్లు సింహాసనం తనే ఆక్రమించాలని ఆశించాడు. మనసులోపల ఈ ఆశ పెట్టుకొని, పైకిమాత్రం బావమరిదితో యెంతో ఇష్టాగోష్ఠిగా నమ్మకంగా ఉంటున్నాడు. కస్తూరినాయకుని నమ్మి, వానిని సేనానాయకునిగా నియమించాడు రాజు.

సేనాని పదవి రావటంతో కస్తూరినాయకునికి పరిస్థితులు మరీ అనుకూలంగా



అమరిపోయినై. శత్రువర్గానికి చెందిన పొరుగురాజులతో కుట్రచేసి, కస్తూరినాయకుడు 'ఫలానా రోజున రాత్రివేళ దాడివెడలి రండి. నేను కోట ద్వారాలు తెరిచివుంచే ఏర్పాటు చేస్తాను!' అని చెప్పాడు.

కస్తూరినాయకుడు చెప్పినట్టుగానే, రాత్రి సమయాన శత్రు దళాధిపతి సులువుగా కోటలో చొరబడ్డాడు. కపటియైన కస్తూరి నాయకుడు శత్రువులతో యుద్ధంచేస్తున్నట్టు నటించాడు. కాని త్వరలోనే వాడు చేసిన కుట్ర వెల్లడైపోయింది. పాపం, ఆ యుద్ధంలో రామరసనాయకుడు వీర మరణం పొందాడు. నిజగల్లురాజ్యం శత్రువుల వశమయిపోయింది.

కస్తూరినాయకుడు తనను నిజగల్లు రాజుగా చేయమని శత్రురాజును కోర బోయాడు. ఐతే ఇప్పుడు, గిరిజవ్వయొక్క సౌందర్యం చూచిన ఆ దళాధిపతి ఒక కొత్త షరతు పెట్టాడు—'గిరిజవ్వ నన్ను పెళ్ళాడితే, ఆమెకు పుట్టే బిడ్డను రాజుగా చేసి, నిన్ను ప్రతినిధిగా ఏర్పరుస్తాను'-అని. 'లేకుంటే, నీకూ లేదు, ఆమెకూ లేదు' అని బెదరించాడుకూడాను.

చేసేదిలేక, అప్పటికి 'సరే' అని తల ఊపాడు కస్తూరినాయకుడు. పోయి, గిరిజవ్వ వుద్దేశం తెలుసుకుందామని ఇద్దరూ కలిసి, ఆమెవద్దకు వెళ్ళారు. దళాధిపతి తన ఉద్దేశం ఆమెకు చెప్పి, జవాబు కోరాడు. 'మా తమ్ముడు వప్పుకొంటే నాకు అభ్యంతరం లేదు' అన్నదామె.

ఏమీ సంశయించకుండా వెంటనే, కస్తూరినాయకుడు 'నాకు సమ్మతమే. సమ్మతించక విధిలేదు' అన్నాడు.

అప్పుడామె ఒకేఒక కోరిక కోరుకొన్నది—'మా కులాచారంప్రకారం, పెళ్ళికి ముందు నేనూ, నా తమ్ముడూ ఊరేగింపు చేసి రావాలి' అన్నది. ఈ వింతకోరికకు అక్కడ అందరూ ఆశ్చర్యపోయారు. దళపతి

'సరే'నన్నాడు. ఊరేగింపు జరగటానికి తగిన ఏర్పాట్లు చేశారు.

ఈ సంగతి అంతా తెలిసిన లకుమవ్వ వచ్చి 'దళాధిపతిని పెళ్ళాడవద్దుసుమా' అని హితవు చెప్పబోయింది. కాని, గిరిజవ్వ చెవినిపెట్టలేదు. అలా మాట మన్నించక పోవటం అక్కయందు భక్తి లేకకాదు. ఒక గొప్ప ఉద్దేశం నెరవేర్చేటందుకే. ఊరేగింపు సమయాన గిరిజవ్వ తన బిడ్డను అక్కగారయిన లకుమవ్వకు పప్పగింత పెట్టి, 'అక్కా!— ఈ బిడ్డ నీది ...!' అంటూ ఆఖరుమాటలు చెప్పి, తనమానాన తను వెళ్ళింది.

గిరిజవ్వ కోరికప్రకారం గొప్ప ఊరేగింపు సాగింది — ఒకపక్కనుంచి కస్తూరినాయకునిది, మరోపక్కనుంచి గిరిజవ్వది. కట్టకడపట, నిజగల్లు నగరమధ్యమందు గల ఎత్తయిన బండరాయిపైన ఇద్దరూ కలుసుకొన్నారు. అక్కడ గిరిజవ్వ, తమ్ముడికి హారతి ఇచ్చి, 'తమ్ముడూ!—నీవల్లకదా, నాకు ఇంతటి మహాపదవి వచ్చింది!' అనేసరికి, వాడు నిజమేనని పొంగిపోయాడు.

మరుక్షణమందే ఆమె శక్తిరూపంతాల్చి, ఉగ్రురాలై, 'ద్రోహీ!— నావల్ల, నావెంట వచ్చిన నీవల్ల రామరసనాయకుని యిల్లు కూలిపోయింది. మన ఇద్దరివల్లా రెండు వంశాలకూ—అటు ఏడుతరాలా ఇటు ఏడు తరాలా తీరని అపకీర్తి వచ్చింది. మన వంటి మహాపాపులు ఇంకా జీవించి వుండటం తల్లిఐన భూమాతకు భారం!!' అంటూ, ఆవేశంతో తమ్ముడిని కౌగలించుకొని, ఎత్తయిన ఆ శిఖరంమీదినించి కిందికి దూకేసింది!!!

పడీపడటంతోనే మారుమాట లేకుండా ఆ రెండు ప్రాణాలూ ఈ లోకం విడిచి పోయినై. గుణమణి, పూజ్యురాలు అని పేరు పొందిన గిరిజవ్వ బలిఅయిన ఆ చోటున ఒక గ్రామం వెలసి, నేటికీ నిలచివున్నది.



# అట్టవిూది బొమ్మ

పహాయజూదంలో ఓడిపోయిన పాండవులను దుర్యోధనుడు అడవులకు వెళ్ళగొట్టినట్టు లోగడనే తెలుసుకొనివున్నాముకద. పాండవులు అరణ్యవాసానికి బయలుదేరేముందుగా ద్వైతవనంలో కొన్నాళ్ళుండి, తరువాత దూరాన వుండే 'కామ్యక' వనానికి చేరుకొన్నారు.

వనవాసమూ, అజ్ఞాతవాసమూ పూర్తిఅయిన తరువాత, దుష్టుడైన దుర్యోధనుడితో తమకు ఎలాసూ యుద్ధం వస్తుందని బాగా తెలుసు అర్జునుడికి. అందుకోసమని, యుద్ధంలో జయించేటందుకు తగిన దివ్యాస్త్రాలను పొందాలని, అతడు తపస్సు ప్రారంభించాడు.

ఇంద్రకీలపర్వతంలో అర్జునుడు ఈశ్వరునిగురించి ఘోరతపస్సు చేయగా పార్వతితోసహా ఈశ్వరుడు, కిరాతవేషంలో వచ్చి అర్జునుని తపోదీక్షను పరీక్షింపసాగాడు.

ఈ పరీక్షకుగాను 'మూకుండు' అనే రాక్షసుడు ఒక అడవి పందిరూపంలో వచ్చి అర్జునుడి తపస్సు భగ్నంచేయబోయాడు. అర్జునుడు దానిని ఒకే బాణంతో కొట్టాడు. అదే సమయాన కిరాతుడుకూడా బాణంవేశాడు. అప్పుడు 'ఈ పందిని నేను చంపానంటే నేను చంపా'నని వారిద్దరిమధ్యనీ పేచీవచ్చింది. కిరాతుడికీ అర్జునుడికీ గొప్పయుద్ధం జరిగింది. శివార్జునుల యుద్ధం అంటే వేరే చెప్పేదేమిటి? మూడులోకాలూ దద్దరిల్లిపోయినై. బాణాలవర్షం కురియసాగింది.

చాలాసేపు యుద్ధం జరిగినతరువాత, చివరకు కిరాతుడు అర్జునుని గాండీవానికి గల 'నారి'ని తన బాణంతో కొట్టి తెంపివేశాడు.

ఇదిచూచి అర్జునుడికి పట్టరాని ఆశ్చర్యం కలిగింది. ఏమీ! ఈ విధంగా తన గాండీవాన్ని ఛేదించగలిగినవాడు ఈశ్వరుడు ఒక్కడే. వెంటనే చిరునవ్వు నవ్వుతూ నించున్న ఈశ్వరుని గుర్తించాడు అర్జునుడు. నమస్కరించాడు.

పైగా, అర్జునుడు శివలింగాన్ని స్థాపించి, దానికి పూజించిన పుష్పాలన్నీ ఆ కిరాతకుని తలపైన స్పష్టంగా కనిపించినై. అందుచేత, ఆయన తప్పక ఈశ్వరుడే అన్న సంగతి అర్జునుడికి రూఢిఐపోయింది. అర్జునుడి తపస్సుకు మెచ్చి, ఈశ్వరుడు తన పాశుపతాస్త్రం అనుగ్రహించి, అదృశ్యమయ్యాడు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1954** జూలై సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ మే 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి. ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-**26**.

## గమనిక

ఇంతవరకూ ఈ ఫోటోశీర్షికల పోటీలో నెగ్గినవారి పేరు ఒక నెలముందుగా ప్రకటిస్తూ వచ్చాము. ఇటుపైన, పాఠకుల సౌకర్యంకోసమని ఒక చిన్న మార్పు చేస్తున్నాము. అది ఏమిటంటే—బహుమతి పొందినవాని పేరూ, ఫొటోలూకూడా ఒకేసారి ప్రకటింపదలిచాము. ఉదాహరణకు—జూన్ నెల ఫలితాలను ఫొటోలతోసహా జూన్ నెలలోనే ప్రకటిస్తాము. బహుమతి మొత్తం రు. 10/-లు. జూన్ నెల సంచిక వెలువడిన తరువాత పంపబడుతుంది.



# అన్నీ గమ్మత్తులే

కృష్ణానదికి ఒడ్డునే ఒక చక్కటి ఇల్లుంది. ఆ ఇల్లు అట్టే పెద్దదికాదు కాని, అందంగా పొందికగా ఇమిడికగా చూడ ముచ్చటగా వుంటుంది. అందులో నివసించే దంపతులకు ఒకసారి కవలలు కలిగారు. ఇద్దరూ మగ శిశువులే.

కవలలు పుట్టిన కొద్ది రోజులకే ఇంటి యజమాని కాలంచేశాడు. అందుచేత, ఇంటి పెత్తనమంతా ఇల్లాలు ఐన కృష్ణవేణి మీదనే పడింది. ఏదో ఇంత కలిగినవాళ్ళు గనుక, కాలక్షేపానికి లోటు లేకపోయింది. కాని, కృష్ణవేణికి వయసు మీరినకొద్దీ సంసారం ఈదుకొని చక్కబెట్టుకురావటం కష్టంగాతోచింది.

పోతే, కవలల సంగతి చెప్పేదేమిటి? అచ్చుమచ్చు ఒక్క మూసలో పోసిన కుందనపు బొమ్మలలాగా వున్నారు. వాళ్లకు తలిదండ్రులు రామూ, లక్ష్మణ అని పేర్లు పెట్టారు. ఐతే, రూపానికి కవలలిద్దరూ ఒక్కటేకాని, వాళ్ళు పెరిగి పెద్ద అయిన కొద్దీ గుణాలలో మాత్రం ఎంతగానో తేడా కనిపిస్తూ వచ్చింది.

పెద్దవాడు రామూ సోమరీ, దుష్ట స్వభావం కలవాడున్నూ. తమ్ముడు లక్ష్మణ జనముద్దుగా ఉండి, నలుగురిలోనూ తలలో నాలుకగా మసులుకొంటూ ఉండేవాడు. ఇదీ ఇద్దరికీ భేదం.

రానురాను రామూ దుండగీడుగా తయారయ్యాడు. వాడు, తోడపుట్టిన తమ్ముడినే నానాతిప్పలూ పెట్టేవాడు. ఐనా, లక్ష్మణకు మట్టుకు అన్నగారంటే ఎంతో భక్తి.

రామూ పన్నెండేళ్ల వాడయ్యాడు. ఒక నాడు తమ్ముడితో కయ్యమాడి, వాడిని చితకకొట్టాడు. బలాఢ్యుడు కావటంచేత, లక్ష్మణను ఇంటినుండి గెంటివేయటానికి కూడా సాహసించాడు.

సి. ప్రకాశం



తల్లి చూస్తూ బాధపడటం తప్ప, పెద్ద వాడిని ఏమీ అనలేకపోయింది. 'అమ్మా! నీవేమీ బాధపడకు. రోజులు ఎప్పుడూ ఇలానే ఉండవు. మంచికాలం రాకపోదు' అంటూ తల్లిని ఊరడించి ఆమె దీవన పొంది వెళ్ళిపోయాడు లక్ష్మణ.

దుండగీడు రామూకు మరి కొద్ది రోజులకే పెళ్లి అయింది. ఆ వచ్చిన పిల్ల గయ్యాళిగంప. పైగా మూర్ఖురాలు. అత్తకూ కోడలికీ మధ్య క్షణమైనా పడేదికాదు. ఇంటికి పెద్దవాడైన రామూ పెళ్ళాం ఎంత చెబితే అంత. వాడు కొమ్ములివ్వటంచేత, ఆ ఊత చూచుకొని, వాడి భార్య కృష్ణవేణిని యమ యాతనలు పెట్టసాగింది. కొత్తగా వచ్చిన కోడలిది ఆడింది ఆటా, పాడింది పాటా కావటం కృష్ణవేణి ఎంతమాత్రం సహించలేకపోయింది. అందుచేత, ఇద్దరి మధ్యా అరకొరలు మరీ హెచ్చు పెరిగినై.

చివరకు చేసేదిలేక, రామూ భార్య మాట విని, తన తల్లినే వెళ్లగొట్టడం జరిగింది. 'పెద్ద బ్రతుకు బ్రతికి ఇటువంటి స్థితికి వచ్చానుకదా' అని అనేక విధాల చింతించింది కృష్ణవేణి. ఈ వేదనతోనే ఆమె కృంగి కృశించిపోతూ, ఇల్లూ వాకిలీ లేకుండా వీథులలోనే తిరుగులాడ వలసిన గతి ఏర్పడింది.

* * *

ఇల్లు విడిచిపోయిన లక్ష్మణ, కాళ్ళు ఎక్కడికి తీసుకపోతే అక్కడికల్లా తిరిగాడు. ఆఖరుకు ఒక అడవిలో ఒక దుండగీడుల ముఠావాళ్ళు వానికి తారసపడ్డారు. వాళ్ళు లక్ష్మణను తమ నాయకునిగా ఉండమని కోరారు. సరే, ఇదీ దైవాజ్ఞగానే భావించి, వాడు ముఠాకు నాయకుడైనాడు. ఐతే, వాడి మంచితనంమాత్రం పోలేదు.

ఇలా వాళ్ళకు నాయకుడు అవటంలో లక్ష్మణకు మనసులో ఒక వుద్దేశంకూడా వున్నది. ఈ ముఠావాళ్లచేత కొన్ని పనులు

చేయించి, అన్నను దారికి తీసుకరావచ్చు కదా అని వాడి తలంపు.

ఇప్పుడు లక్ష్మణకు మంచి అవకాశం చిక్కింది. అంగబలం చేకూరింది. స్థావరం చిక్కింది. గుండెనిబ్బరం కలిగింది. ఎప్పటి కప్పుడు ఇంటి విషయాలన్నీ తన ముఠా ద్వారా తెలుసుకొంటూనే వున్నాడు. క్రమంగా తల్లికి పట్టిన గతి తెలియ వచ్చింది. తెలియగానే లక్ష్మణ ఆమెను తన వద్దకు రప్పించుకొని, అడవిలో ఒక చోట సదుపాయమైన బస ఏర్పరిచాడు.

లక్ష్మణ వదినెగారు అక్కడ ఇంటిలో సర్వాధికారి అయివున్నదాయె. అన్నగారు రామూ ఆమె మాటకు అడుగుదాటని బానిసగా తయారయ్యాడు. ఈ పరిస్థితు లలో, దంపతుల మధ్యని ఒక తంపి పెట్టితేకాని వాళ్ల తెగులు కుదరదని నిశ్చ యించాడు. అయితే, అన్నగారికి ఎట్టి అప కారమూ జరగటం లక్ష్మణకు ఇష్టంలేదు. అన్నను బాధించని విధంగానే బుద్ధి చెప్పాలని వాడు నిశ్చయించుకొన్నాడు.

ముఠాలోని దుండగీళ్ళు సామాన్యులు కారు. అతి చతురులు. ముందుగా లక్ష్మణ, వాళ్లను తన ఇంటికి పంపించి పెరటిలోని ఆవును తన బసకు రప్పించుకొన్నాడు.



ఈ ఆవుపాలను ప్రత్యేకించి తన తల్లికోసమే వినియోగించటానికి ఏర్పాటు చేశాడు.

అక్కడ మరునాడు—పెరటిలో ఆవు కనిపించకపోవటంతో రామూ భార్యను నిలదీసి అడిగాడు. ఆమె తెల్లబోయింది. ఇద్దరి మధ్యనీ కలహం పుట్టింది. 'నేను ఏ పాపం ఎరుగ'నంటుంది ఆమె. 'ఇంట్లో ఉన్నదానివి నీకు తెలియకపోవడం ఏమిటి?' అని అంటూ, రామూ పెళ్ళాన్ని మెత్తగా తన్నాడు.

లక్ష్మణకు ఎప్పుడో తెలుసు, అంతా ఇలా జరుగుతుందని. సరీగా లక్ష్మణ అనుకొన్నట్టే జరిగింది ఇప్పుడు. వాడు ఇంతటితో




ఊరుకోలేదు. తరువాత మరి ఒక చిత్రం జరిగింది. ముఠావాళ్ళు రాముా ఇంటి ఇరుగుపొరుగుల ఇళ్ళల్లోకి సమయం కని పెట్టి దూరి, మంచిమంచి విలువైన చీరలు దొంగిలించి తెచ్చేవారు.

ఇవన్నీ వాళ్ళు రాముా భార్యవద్దకు పట్టుకపోయి, తన భర్త పంపాడని చెప్పి, ఆమెకు ఇస్తూవచ్చారు.

పరమ మూర్ఖురాలైన రాముా భార్య నిజమే ననుకొని, అవన్నీ సంతోషంతో పుచ్చుకొని దాచుకొనేది. పైగా, సంతోషం పట్టలేక, పనికట్టుకొని ఇరుగు పొరుగు లందరినీ పిలిచి, 'చూచావమ్మా, మా ఆయన ఎటువంటి చీరలు పంపించారో!' అంటూ, ఆ చీరలన్నీ అందరకూ చూపటం ప్రారంభించింది.

ఆడవాళ్ళందరూ తమ తమ భర్తలతో ఈ సంగతి చెప్పారు. కొద్ది రోజులకల్లా— ఆడవాళ్ల చీరలన్నీ ఫలానా రాముా దొంగి లించి తన భార్యకు ఇస్తున్నాడని ఊరిలో పెద్ద గోల బయలుదేరింది.

'కావాలంటే, దొంగసొత్తులన్నీ రాముా ఇంటిలో దొరుకుతై. రండి చూదాం!' అంటూ, ఒకనాడు గ్రామస్థులందరూ బయలుదేరారు.

గ్రామస్థులు అంతమందీ ఒక్కసారిగా వెళ్ళేసరికి, రాముా వాళ్ళను శక్తికొద్దీ అటకా యించాడు. 'నువు దొంగవు. గజదొంగవు. కాకుంటే మమ్మల్ని ఎందుకు పోనియ్యవు?' అని వాళ్ళు గదమాయించారు.

అప్పుడు పౌరుషంతో రాముా 'అయితే చూచుకోండి!' అంటూ కోపంకొద్దీ ఇంటో పెట్టెలూ, మూటలూ గబగబ ఇవతలకు విసిరి పారవేశాడు.

'రండ్రా! రండ్రా!!' అని ఒకరినొకరు పలకరించుకొంటూ, గ్రామస్థులు రాముా ఇంటిలోపల దూరి అన్నీ పరీక్షచేశారు. అక్కడ అందరకూ ఆశ్చర్యం తోచేటట్టుగా,




వాళ్ళ వాళ్ళ చీరలన్నీ ఆ యింటిలోవున్న పెట్టెల్లో దొరికిపోయినై.

స్పష్టంగా కంటికి కనిపిస్తూవుండగా లేదనటం ఎలా? 'నేను కాదు' అని రాముూ అంటే మాత్రం ఎవరు నమ్ముతారు? గ్రామస్థులకు మనస్సు ఉడికిపోయింది. కోపం పట్టలేక, రాముూను పట్టి, కట్టి, పచ్చడి అయేలాగా చితుకకొట్టారు. రాముూ పచ్చిదొంగ, వాడిని కనిపెట్టివుండాలి అని ఊరిలో వాదు పడిపోయింది!

ఇలా చావుదెబ్బలు తిన్న రాముూకు ఇదేమీ అర్థంకాలేదు. ఇదంతా గయ్యాళి ఐన తనభార్య చేసిన మోసమే అని తలిచి, గబగబ ఇంట్లోకి పోయి పెళ్ళాన్ని సున్నం లోకి ఎముక లేకుండా తన్ని వదిలాడు.

'ఏమిటి ఈ కుట్ర అంతా?' అని రాముూ భార్యను గద్దించి అడిగాడు. ఆమె వెర్రి చూపులు చూస్తుందేకాని, ఎంత తన్నినా ఉలుకూ పలుకూ లేదు. ఐనా, అమె మాత్రం ఏం చెప్పగలదు? ఆమెకు కూడా ఇదంతా అగమ్యంగా తోచింది, ఎవడో మోసకారి చేసివుంటాడు.

వాడిని కనిపెట్టి తగిన శాస్తి చేయాలి అని అమె పంతంపట్టి కూర్చున్నది. ఇంతలో తెలివైన రాముూ భార్యతో 'ఒసే, ఒసే, నేను జరుగురుగా ఊరికిపోతున్నాను. మళ్ళీ రావటానికి ఒక వారంపైగా పడుతుంది' అని చెప్పాడు. నిజమేననుకొన్నది మూర్ఖురాలైన వాడి భార్య.

పగటిపూటల్లా ఎలానో ఊరి బయట కాలక్షేపంచేసి, అర్థరాత్రివేళ ఆకస్మికంగా రాముూ తిరిగి ఇంటికి వచ్చాడు. వచ్చి, గోడవారలంటే మెల్లగా అడుగులు వేస్తూ లోపల ప్రవేశించబోయాడు.

చీరలు తెచ్చి ఇస్తున్న ఆ దొంగవాడిని పట్టి శాస్తి చేయాలనే దీక్షతో రాముూభార్య నిద్రపోకుండా మెలకువతోనే పడుకొని వున్నది. ఆ అర్థరాత్రిసమయాన ఎవరో




వస్తున్న చప్పుడు కావటం, మసకమసకగా మనిషి నీడకూడా కనబడటంతో నిజంగానే ఆ దొంగ వస్తున్నా డనుకొన్నది ఆమె.

పడుకొనివున్న ఆమె చప్పుడు కాకుండా లేచింది. చాకు తీసింది. దొంగ ఎవరో కని పెట్టాలని రాముా ప్రయత్నం, ఆ దొంగను పట్టి శిక్షించాలని వాడి భార్య ఆరాటం. రాముా మెల్లగా లోపల ప్రవేశించి, కిటికీ కటకటాలలోనించి తొంగి చూచాడు.

ఎప్పుడైతే రాముా అలా కిటికీదగ్గర నిల బడి చూస్తూవున్నాడో, పట్టుదలతో కని పెట్టుకొనివున్న వాడి భార్య గబగబ వచ్చి, 'దొరికావురా దొంగా!—' అంటూ చేత నున్న చాకుతో కోపంకొందికీ వాడి ముక్కు చెక్కవేయబోయింది.

దొంగమీదనే దృష్టి పెట్టుకొనివున్న రాముాకు, ఆ చీకటిలో తన ముక్కు చెక్కేది ఎవరూ అన్న గుర్తు తెలియనేలేదు. అదంతా తను అనుకొన్న మోసకారి చేసిన కుట్రేనని వాడి వూహ.

ముక్కు తెగటంతో, ఇంటి పెంకులు ఎగిరిపోయేటట్టుగా పెద్ద కేకలువేస్తూ, గోల చేయసాగాడు రాముా. ఈ కేకలు విని ఇరుగుపొరుగులు వచ్చి, తనను రక్షించి, దొంగవాడిని పట్టుకొని శిక్షిస్తారని రాముా ఉద్దేశించాడు.

దంపతు లిద్దరూకూడా ఇంతపని చేసిన ఆ మోసకారి ఎవరో పట్టుకోవాలని ఆత్రంతో వున్నారు. కనబడకుండా ఈ నాటకమంతా ఆడిస్తున్న ఆ దొంగను పట్టితీరాలని వాళ్లు పంతంపట్టివున్నారు.

ఇటువంటి సమయంలో—రాముా కేకలు విని ఎదట ప్రత్యక్షమైనవాడు ఇరుగు పొరుగులు కాదు, వాడి తమ్ముడు లక్ష్మణే! ఆ అవస్థలో లక్ష్మణను చూడగానే రాముా, వాడిభార్యా గతుక్కుమని పొయ్యారు.

వెంటనే లక్ష్మణ అన్నగారి ముక్కుకు కట్టు కట్టి, అతని ఓదార్చి, పాదాలమీద పడి

క్షమించమన్నాడు. 'అన్నయ్యా!— అపరాధం క్షమించాలి. నేను ఇల్లు వదిలి పోయినప్పటినుండీ నీకు కలిగిన చిక్కులన్నీ నా వల్లనే కలిగాయని నమ్మవలిసింది. అయినదానికి చింతించవద్దు. నీ కష్టాలు గట్టెక్కినై' అన్నాడు.

రామూకు ఇదేమీ అర్థం కాలేదు. అప్పుడు లక్ష్మణ, అన్నగారిని స్తిమితపడమని చెప్పి, తరువాత అతనిని అడవిలో తన బసకు తీసుకువెళ్ళాడు.

అక్కడికి వెళ్ళేసరికి రామూకు తన ఆవు కంటపడింది. ఆశ్చర్యపడ్డాడు రామూ. అన్నను లోపలికి తీసుకవెళ్ళాడు లక్ష్మణ. తల్లి రామూకు ఎదురువచ్చి 'నాయనా—!' అంటూ ప్రేమతో కౌగిలించుకొన్నది. రామూ దుఃఖం పట్టలేక చిన్నపిల్లవాడిలా ఏడువసాగాడు. రామూ తల్లి కాళ్ళపై పడి, 'అమ్మా!—బుద్ధి గడ్డితిని, నా భార్య మాట విని చెడ్డాను. దానిని నమ్మటమే నా ప్రాణంమీదికి వచ్చింది. క్షమించు...' అని వేడుకొన్నాడు.

అటుపైన లక్ష్మణ తను చేసిన పనులన్నీ పూసగుచ్చినట్టు అన్నకు విన్నవించాడు. తల్లిని తను ఏ విధంగా పోషించిందీ కూడా పూర్తిగా వివరించాడు.




అప్పటినించీ అన్నాదమ్ము లిద్దరూ ఎటువంటి అరమరా లేకుండా అన్యోన్యంగా మెలగజొచ్చారు. తమ్మునిలాగానే, రామూ తల్లిని భక్తితో పూజించేవాడు.

లక్ష్మణ, తనను ఆశ్రయించిన ముఠా వాళ్లను బాగుచేసి, మంచిదారికి తెచ్చాడు. లక్ష్మణ నాయకత్వం కింద ఆ దుండగీండ్లు లోకానికి ఉపయోగించే పనులు ఎన్నో చేస్తూవచ్చారు.

ఈ విధంగా లక్ష్మణ మంచితనంవల్ల అటు వాడి అన్నావదినెలా బాగుపడ్డారు, ఇటు దుండగీండ్ల ముఠాకూడా లోకానికి ఉపకరించింది.

# రత్నగోళం (అట్టచివరి బొమ్మ) - 1

అనేకవేల సంవత్సరాలకు పూర్వం, జపానుదేశంలో 'టోజో' అనే ధనవంతుడు ఉండేవాడు. ఆయన కోట్లకు పడగలెత్తిన శ్రీమంతుడు. ఆయనకు 'హిట్సూ' అనే కూతురున్నది. ఆమె సౌందర్యం సాటి లేనిది. పైగా దైవభక్తి కలది.

టోజో, తన కూతురును ఒక మహాచక్రవర్తికి రాణిగా చేయాలని నిశ్చయించుకొన్నాడు. యుక్తవయస్సు వచ్చింది హిట్సూకు. తన ఈడువాళ్లందరికి పెళ్లి ఐపోవటంచూచి, ఆమెకుకూడా పెళ్లాడాలని మనస్సులో తలంపు కలిగింది.

ఆమె అనుకొన్నట్టుగానే, ఒకనాడు టోజో భవనానికి ఎవరో తరలి వస్తున్నట్టు పెద్ద కోలాహలంతో సందడి వినవచ్చింది. అంతలోనే చీనాదేశపు చక్రవర్తి రావటం, హిట్సూకు ఆమెతండ్రి కబురంపటం జరిగింది. సిగ్గు పడుతూ పోయి, హిట్సూ చక్రవర్తి ఎదట నిలబడింది.

అప్పుడు టోజో కూతురుతో చక్రవర్తికి గల ఐశ్వర్యాలూ, సంపదలూ, భోగభాగ్యాలూ అన్నీ వర్ణించి చెప్పి, 'ఆయన నిన్ను రాణిగా చేసుకొంటానంటున్నారు' అన్నాడు. అందుకు హిట్సూ 'మరి, నేను నా దేవికి పంపగల గొప్ప కానుకలుంటాయా ఆ రాజ్యంలో ?' అని ప్రశ్నించింది తండ్రిని. 'తప్పకుండా ఉంటాయి తల్లీ! కనివిని ఎరుగని అద్భుతాలూ, అపురూప వస్తువులూ ఎన్నోవుంటాయి అక్కడ' అన్నాడు టోజో.

పెళ్లికి అతివైభవమైన ఏర్పాట్లు జరిగినై. కడసారి హిట్సూ తన ఇష్టదేవత ఐన దేవిఆలయానికి పోయి మ్రొక్కుకొన్నది. 'నేను చీనాదేశపు రాణినై, నీకు అపురూపమైన కానుకలు అర్పిస్తాను' అని దేవికి ఆమె మాటఇచ్చింది.

తరువాత, పెళ్ళి అయింది. చక్రవర్తి రాణితో తన దేశం చేరుకొన్నాడు. అక్కడ దివ్యమైన తన కోటలో వర్ణింపతరముకాని అందచందాలు, నందన వనాలు చూపుతూ, బంగారు మలామాచేసిన బాటలమీద భార్యను నడిపించాడు.

అతని నందనవనంలో మొక్కలు ఏడాదిపొడుగునా పువ్వులు పూస్తాయి. పక్షులు మధురంగా పాడతాయి. నిజానికి అటువంటి ఉద్యానం మరెక్కడా లేనేలేదని చెప్పవచ్చు. ఇవన్నీ చూపించి చక్రవర్తి తన రాణిఐన హిట్సూను తన్మయురాలయేటట్టు చేశాడు.

ఇన్ని వింతలమధ్య హిట్సూకు స్వర్గసౌఖ్యమే కలిగింది. కాని,—




చల్లని రోజొక వెన్నెల రాత్రీ
చక్కటి చిత్రం జరిగింది :

ఆకటి కోర్వక మూషిక మొకటి
కోమటి ఇంట్లో కెళ్ళింది,

పెద్ద పేటికను గట్టి దీక్షతో
రంధ్రము చేసీ దూరింది.

అంతకు మునుపే ఆ పేటికలో
ఆశ లుడిగి యొక విషసర్పము తన
కేది దారి యని ఖేద మందుతూ
కుందుచు అట్టులె పడియుండె.

శ్రమపడి రంధ్రము చేసిన ఎలుక
కూటికొరకు కాంక్షించెడి ఎలుక
గడగడ వణకుచు, పేటికయందలి
సర్పరాజునకు ఆహుతియయ్యెను !

ఏ దరి లేక, ఆకలి కోర్వక
ఏడ్చెడి పాము ఎదురొచ్చిన ఆ
ఎలుకను తిని, తన ఆకలి తీరగ,
ఎలుక చేసినా కలుగు దారినే
వెలుపల బడి పరువెత్తింది !

చదువరులారా, ఫణిరాజునకు
దైవబలంబే లేకున్న
ఎలుకమాదిరే మంచి కెళ్ళినా
చెడుగై కష్టము చేకురుగా ?

దైవబలమె మనపట్ల నుండిన
పామువోలెనే బయటబడుచు మన
బ్రతుకు భాగ్యమై పండునుగా !

ఇ. వి. వర్మ

# చిత్రకథ




ఈ పటంలో నాలుగు బొమ్మలున్నయి. వీటిని వరుసగా చూస్తూ పోయినప్పుడు, మీకు ఒక చిత్రమైన కథ స్ఫురిస్తుంది. అలా మీకు స్ఫురించకపోయినట్టయితే, వచ్చే నెల చందమామ చూడండి.

**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26, Controlling Editor : SRI 'CHAKRAPANI'**

Photo by J. V. S. Sastry



బహుమతి
పొందిన వ్యాఖ్య

పిలుపు

పంపినవారు:
కె. ఆర్. కుమార్ - తెనాలి

